అక్టోబరు 1998
సంపుటి 14 సంచిక 10

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of "*SREEVANI*" Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7 - 10 -1998**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం :
**తమసోమా జ్యోతిర్గమయ!**

# అమృతవాణి

శ్లో॥ అత్రా2పి చా2న్యత్రతు విద్యమాన
పదార్ధ సమ్మర్శన మేవ కార్యం
యథా ప్రకారార్ధ గుణాభిమర్శనం
సందర్శయత్యేవ తదీయదోషమ్॥

ముముక్షువులయినవారు ఇహపరములలోని విషయములను గురించి సవిమర్శగా తెలిసికోవాలి. చక్కగా పరిశీలించిన మీదట ఇహ పర పదార్ధములలోని దోషములన్నియు తెల్లము కాగలవు.

ప్రతి మనిషీ నాకు మోక్షం కావాలి అని కోరుకుంటాడు. ఆ ఇచ్ఛ తీవ్రమైతే ముముక్ష అంటారు. చతుర్విధ పురుషార్థాల్లో చివరి పురుషార్థఫలం మోక్షమే. తిరిగి జన్మలేకపోవటం మోక్షం.

మానవుడు పుట్టింది మొదలు చనిపోయేవరకు అనేక బాధలు పడతాడు. ఎంత ధనసంపదలున్నవాడైనా నేను హాయిగా వున్నానని సంపూర్ణ విశ్వాసంతో చెప్పలేడు. కారణం కష్టసుఖాల కలగాపులగమే జీవితం కనుక. శరీరం ధరించిన తర్వాత ఏదోరకమైన రోగానికి గురికాకతప్పదు కనుక. తిరిగి యీ శరీరం వద్దు బాబోయ్ అనే స్థితికి ఎప్పటికైనా రాక తప్పదు. అందుకు పరిష్కారంగా ముక్తిని కోరుకుంటాడు.

అయితే నిజమాలోచిస్తే నాకు ముక్తి కావాలను కొన్నంత మాత్రాన ముక్తి రాదు. దానికి తీవ్రమైన విరక్తి కావాలి. ఇంద్రియాలు విషయములందు ప్రవర్తిస్తున్నంత వరకు విరక్తి పుట్టదు. విషయాలలో సుఖమున్నది అనుకున్నంతవరకు విరక్తి పుట్టదు. ఈ లోకంలో అనుభవించే విషయ సుఖాలు, నిజం సుఖాలు కావు. వీటి ఫలితం దుఃఖమే అని తెలిసికొనేంతవరకు విరక్తి పుట్టదు.

విషయాలలో ఉన్న దోషమేమిటో ముందుగా తెలుసుకోవాలి. దోషభూయిష్టమైనప్పటికీ విషయేచ్ఛ కలుగుతున్నదంటే అది సుఖ భ్రాంతిని కలుగ జేయటమే కారణం. అందువల్ల ఆ దోషాన్ని, దానీ వల్ల వచ్చే నష్టాన్ని గుర్తించినట్లయితే ఆ విషయాలమీదికి ఇంద్రియాలు వెళ్ళవు.

సామాన్యంగా ఇహలోకంలో విషయ సుఖాలు నిత్యాలు కాకపోవచ్చు కాని పరలోకంలో సుఖాలు మాత్రం శాశ్వతాలనుకొంటారు. అది పొరపాటు. పరలోకంలో కూడా తాను చేసుకొన్న పుణ్యం ఉన్నంతకాలమే ఆ పుణ్య ఫలమైన స్వర్గ సుఖం అనుభవిస్తాడు. ఆ పుణ్యం అయిపోయిన మరుక్షణమే తిరిగి మనుష్యలోకంలో పుట్టాల్సిందే!

కనుక ఇహపర లోకాలలో ఇంద్రియాలు విషయ సుఖాలనుభవించటమనేది స్వప్న సుఖం లాంటిది.

**కూచిభట్ల చంద్రశేఖర శర్మ**

పాప పుణ్య కర్మల ఫలితంగా వచ్చిన శరీరం, ఇంద్రియాలు ఇవన్నీ పర్యవసానంలో దుఃఖాన్నే ఇస్తాయి. విషయములను దోషాల పుట్టగా భావించి వాటిని చూస్తేనే వాంతి వచ్చేటంతటి అసహ్యభావాన్ని కలిగి వుంటే అప్పుడది విరక్తికి కారణమవుతుంది.

కనుక ఇహ పరలోక విషయసుఖాలను బాగా విమర్శించి చూచినట్లయితే గాని వాటి దోషమేమిటో తెలియదన్నమాట. తెలిస్తే విరక్తి కలిగి తీరాలి. అది ముక్తి హేతువవుతుంది.

## విదురనీతి

"పర్జన్య నాథాః పశవో
రాజానో మన్త్రిబాన్ధవాః
పతయో బాన్ధవాః స్త్రీణాం
బ్రాహ్మణా వేదబాన్ధవాః"

పశువులకు మేఘములే శరణ్యము. రాజులకు మంత్రులే బంధువులు. స్త్రీలకు పతులు బంధువులు. బ్రాహ్మణులకు వేదములే బంధువులు.

# TIRUMALA TIRUPATI DEVASTHANAMS
## TIRUPATI



ROC NO. PR4/23306/ADV.93/TTD/98
Dt. 8-9-98



# తిరుమల
# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి
# బ్రహ్మోత్సవాలు

## ది. 23-9-1998 నుండి ది. 1-10-1998 వరకు

### ముఖ్య ఉత్సవాలు



| | | |
|---|---|---|
| ధ్వజారోహణం | : | సెప్టెంబరు - 23 |
| గరుడసేవ | : | సెప్టెంబరు - 27 |
| రథోత్సవం | : | సెప్టెంబరు - 30 |
| చక్రస్నానం | : | అక్టోబరు - 1 |

- కార్యనిర్వహణాధికారి -



# 'ఆత్మ తత్త్వము ఎరిగినవాడు నరుడు ఎరుగనివాడు నరకుడు'

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదా2త్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే! యుగే!!"

ధర్మం నశించి అధర్మం పెచ్చు పెరిగినప్పుడల్లా నన్ను నేనే సృజించుకుంటాను. సజ్జనులను సంరక్షించటానికి, దుర్జనులను శిక్షించటానికి, ధర్మాన్ని స్థాపించటానికి ప్రతి యుగమునందూ నేను అవతరిస్తూనే ఉంటాను. ఇది 'గీత'లో పరమాత్ముడు చెప్పిన మాట. అది వేదవాక్కు. భగవంతుడు చేసిన ప్రతిజ్ఞ అది. అందువలననే ద్వాపర యుగంలో పరమాత్మ శ్రీ కృష్ణుడుగా జన్మించి చిన్న నాటి నుండే ఎంతోమంది దుష్టులను శిక్షించాడు.

పూర్వము శ్రీ మహావిష్ణువు హిరణ్యాక్షుని బారి నుండి భూదేవిని ఉద్ధరించటానికి వరాహావతారం ఎత్తి హిరణ్యాక్షుని సంహరించాడు. ఆ సమయంలో భూదేవికి వరాహస్వామికి కలిగిన కుమారుడే "నరకుడు". నరకుడు జన్మకాలం ప్రకారం అసురుడైనాడు. తన తల్లి చేత తప్ప తనకు మృత్యువులేదనే వరాన్ని పొందాడు. ఆ వర బలగర్వం చేత ముల్లోకాలను బాధించటం మొదలు పెట్టాడు. చేయరాని అకృత్యాలు ఎన్నో చేశాడు. వాడు పెట్టే బాధలు భరించలేక ప్రజలందరూ భగవంతునితో మొర పెట్టుకున్నారు. దేనికైనా కాలం కలిసి రావాలి. అప్పటివరకు భగవంతుడు కూడా సాక్షీ భూతంగానే ఉంటాడు. ద్వాపరయుగంలో పరమాత్మ శ్రీకృష్ణునిగా అవతరించాడు. శ్రీ కృష్ణుని భార్య సత్యభామ. ఆమె భూదేవి అంశతో జన్మించింది. దేవతల కోరికపై శ్రీ కృష్ణుడు నరకాసురునిపై యుద్ధానికి బయలు దేరుతుండగా, సత్యభామ తాను కూడా యుద్ధ రంగానికి బయలుదేరి వస్తానని బయలుదేరింది. సర్వమూ తెలిసిన సర్వేశ్వరుడు సత్యభామా సమేతుడై యుద్ధానికి బయలు దేరాడు. కొంతసేపు యుద్ధం చేసి అలసినట్లుగా ప్రక్కకు తప్పుకున్నాడు. అప్పుడు సత్యభామ రంగ ప్రవేశం చేసి నరకుడితో యుద్ధం చేసి అతనిని సంహరించింది.

నరకుడిని సంహరించిన రోజే, 'నరకచతుర్దశి'. పూర్వపు విషయం తెలిసిన సత్యభామ, తన కొడుకు చనిపోయిన రోజున ప్రజలందరూ దీపాలను వెలిగించి పండుగ జరుపుకోవాలని కోరుకున్నది. ఆశ్వయుజ బహుళ చతుర్దశి, నరక చతుర్దశి. అందరూ ఆ రోజు ప్రొద్దునే లేచి తలంటు స్నానం చేసి, పిండి వంటలతో భోజనాలు చేసి, క్రొత్త బట్టలు ధరించి సాయంకాలం బాణాసంచ కాలుస్తారు. మరునాడు అమావాస్య. అమావాస్యనాడు సాయంత్రం అనేక దీపాలను వెలిగించి దీపలక్ష్మికి స్వాగతం పలుకుతారు. నరకుడి బాధలనుండి ప్రజలు విముక్తి

**కొమరగిరి జయప్రద**

పొందిన రోజు నరకచతుర్దశి. ఇది దీపావళి పండుగ ప్రాముఖ్యత. ఇక ఈ దీపావళి యొక్క అంతరార్థము ఏమిటంటే, "ఆత్మతత్త్వమును ఎరిగిన వాడు నరుడు. ఎరుగని వాడు నరకుడు" అన్నారు సత్యసాయిబాబావారు. ఆత్మతత్త్వమును మరచిన వాడే అజ్ఞాని, మూర్ఖుడు. అట్టివాడు భుజబలము, ధనబలము, అధికారబలములే శాశ్వతమనుకొని వాటిని దుర్వినియోగవరచి, మానవత్వమును మరచి, దానవుడవుతాడు. లోకకంటకుడవుతాడు. చివరకు అధోగతిని పొందుతాడు. నారాయణుని ఎరిగినవాడు నరుడయితే, నారాయణుని మరచినవాడు నరకుడు. నరకుని వధించటానికి సాక్షాత్తు నారాయణుడే దిగిరావలసి వచ్చింది. సత్యము అనే సత్యభామతోనే అజ్ఞాని, మూర్ఖుడు అయిన నరకుని వధింప చేశాడు పరమాత్మ.

దీపావళి రోజున అనేక జ్యోతులను వెలిగించి "దీపలక్ష్మి, దివ్యలక్ష్మి మాయింటికి రావె మహాలక్ష్మి" అని లక్ష్మీదేవిని పూజించటం మన సంప్రదాయం. దీపము అనంతమయిన శక్తి కలది. వెలుగును ప్రసాదిస్తుంది. చీకటిని దూరం చేస్తుంది. దీపం తాను దహించుకొని పోతూ చుట్టు ప్రక్కల వారికి వెలుగునిస్తుంది. దీనిలో స్వార్థం ఏమాత్రం లేదు. త్యాగమే దీపం యొక్క లక్ష్యం.

అందువలన ప్రతి మనిషి జీవితం, దీపజ్యోతిలాగా త్యాగమయంగా, ఊర్ధ్వగామిగా వెలగాలని జ్యోతిలోని అంతరార్థం. అగ్ని స్వరూపమయిన దీపం సత్య, జ్ఞాన, నిర్మల తత్త్వాలకు ప్రతిరూపం. మంగళ స్వరూపం. కనుకనే అనాదినుండి మన భారతీయులు ఏ చిన్న శుభకార్యానికైనా ముందుగా దీపం వెలిగించి ప్రారంభం చేస్తారు. ఉభయ సంధ్యలలోను దైవ సన్నిధిలో దీపం వెలిగిస్తే మంచిదని పెద్దలు చెబుతుంటారు. దీపావళినాడు ఒక జ్యోతిని ముందుగా వెలిగించి, మిగతా అన్నింటిని దానితోనే వెలిగిస్తారు. ఆ జ్యోతియే దివ్యజ్యోతి, ప్రేమజ్యోతి, జ్ఞానజ్యోతి, ఆత్మజ్యోతి, పరంజ్యోతి. అందుకే మనవారు జ్యోతిని పరబ్రహ్మ స్వరూపంగా భావించారు.

**దీపం జ్యోతి పరబ్రహ్మ దీపం సర్వతమోపహం**
**దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీపం నమోస్తుతే॥**

అని సంధ్యా దీపం వెలిగించి నమస్కరిస్తారు. ప్రతి మనిషిలోను ఈ దివ్యజ్ఞాన జ్యోతి వెలుగుతూనే ఉంటుంది. కానీ అజ్ఞానము, అహంకారమనే చీకటి పొరలు దానిని కనపడనివ్వవు. కాబట్టి ప్రతివారూ అజ్ఞాన అహంకారములనే నరకాసురగుణాలను వదలి, ప్రేమ, భక్తి జ్ఞానములను, దయా దాక్షిణ్యములనే సద్గుణములను పెంచుకోవాలి. అప్పుడే మనలోని జ్యోతిని మనం దర్శించగలుగుతాము. లేకపోతే ఎదుగు బొదుగు లేకుండా అలాగే ఉండిపోతాము. కాబట్టి కొడిగట్టిన దీపంలాగా ఉండిపోకుండా దివ్య జ్యోతిలాగా ప్రకాశించేందుకు ప్రతి ఒక్కరూ ప్రయత్నించాలి. ☆

## సనత్సుజాత ఉవాచ

**"జ్ఞానంచ సత్యంచ దమశ్రుతంచ**
**హ్యామాత్సర్యం హ్రీస్తితిక్షానసూయా**
**యజ్ఞశ్చ దానంచ ధృతిశ్శమశ్చ**
**మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య"**

భగవత్ జ్ఞానం, సత్యం, దమం, శాస్త్రశ్రవణం, అమాత్సర్యం, లజ్జ, సహనశీలత్వం, అనసూయ, యజ్ఞం, దానం, ధృడత్వం, అంతరింద్రియనిగ్రహం - ఈ పన్నెండు బ్రాహ్మణునకు నిత్య వ్రతాలు. బ్రహ్మవేత్త నిరంతరం వీటిని ఆచరిస్తూ ఉంటాడు.

గ్రంథ సమీక్ష :

# "కృష్ణం వందే జగద్గురుమ్"

**రచన : శ్రీపత్రి వేంకట రామమోహనరావు**

**వెల రూ 20/-**

**ప్రతులకు : కార్యనిర్వహణాధికారి మరియు**
**డిప్యూటీ కమీషనరు**
**శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము**
**ద్వారకాతిరుమల (చిన్న తిరుపతి)**
**పశ్చిమగోదావరి జిల్లా - 534 426**

ఈ పద్యకావ్యము లీలాశుకుని "శ్రీ కృష్ణ కర్ణామృతమునకు" యథాతథ అనువాదము కాదు. ఈ కవి మాతృకలోని సంస్కృత శ్లోకముల భావము లను గ్రహించి తనకున్న సాహిత్య పఠనానుభవాన్ని దృష్టి యందిడుకొని రచించిన శృంగార భక్తి రస భరిత కావ్య పారిజాతము. పద్య కవితా దీపము కొడిగట్టి కునారిల్లుట హృదయ పరితాపము కల్గించుచున్నదని, ఆ దీప కళికకు శక్తి మేరకు స్నేహము నందించి వత్తి నెగదోయవలెనను పేరాశయే ఈ ప్రయాసయని కవి శ్రీ రామమోహనరావు కావ్యంలోని "నివేదన" లో పేర్కొన్నారు. ఈ కావ్యాన్ని చదువుచున్నప్పుడు జయదేవుని అష్టపదులు జ్ఞాపకం వస్తాయి. ఇందలి ఆధ్యాత్మకపరమైన "ఆయువు గల్గునంతవరకయ్యది నాదను భ్రాంతి గొల్పు," "కాయము శక్తి హీనతను కార్శ్యము నొందకమున్నె" "రొప్పులు రోగముల్ ప్రబలి" వంటి పద్యాలు కవి కవితా పరిణతిక నిదర్శనాలు. ప్రతి పద్యంలోని మూడు పాదాలలోను శృంగార భావనలతో కూడిన రసప్రవాహంలో పతితను కొట్టుకుపోయేటట్లు చేయడం, చివరి పాదంలో కవితానుగా సాక్షాత్కరించి ఆధ్యాత్మిక భావనలతో నిలుపుదలచేయడం యిందలి కవితాప్రతిభ, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి తరువాత అంతటి సులభశైలిలో కమనీయము, రమణీయము, ఆదరణీయమునైన రచన ఈ కవి కలం ద్వారా వెలువడటం హర్షణీయం. ఇందలి పద్యాలు హృద్యాలు, అనపద్యాలు. సమస్త జనావళికి శిరోధార్యాలు. "కృష్ణం వందే జగద్గురుమ్" పుస్తకము ప్రతి ఒక్కరు చదువ తగినది.

సమీక్షకులు - **కొవ్వలి రామశేషు**, విస్సన్నపేట.

# కంభంపాటి స్వాములు

✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻

కృష్ణాజిల్లా వత్సవాయి మండలంలో కంభంపాడు అనే గ్రామం ఉంది. 1930 ప్రాంతంలో ఆ గ్రామవాసి భండారు వెంకట సుబ్బారావుగారికి రైలులో ఒక యువసన్యాసి కలిశాడు. 'మాఊరు రండి!' అనగానే ఆయన సరేనని సుబ్బారావుగారి వెంటవచ్చారు.

పచ్చని పసిమి ఛాయలో మెరిసిపోతున్న ఆ యువసన్యాసి ముఖవర్చస్సు, స్ఫురద్రూపం, సౌమ్యవర్తనం గ్రామంలో అందర్నీ ఆకట్టుకున్నాయి. సుబ్బారావుగారు తన అన్నగార్లు పర్వతాలయ్య, లక్ష్మీనారాయణలతో సంప్రదించి ఆ సన్యాసికి తమ గ్రామంలోనే ఒక ఆశ్రమాన్ని ఏర్పరచారు. ఆ ఆశ్రమంలో ఆయన ముక్తినాథాలయం అనే పేర ఒక శివాలయాన్ని నిర్మించారు. అనేక మంది ఇళ్లూ వాకిళ్లూ వదిలివేసి, వచ్చి ఆ ఆశ్రమంలో నివసించసాగారు. అలా ఆశ్రమవాసం మొదలుపెట్టిన వారిలో సుబ్బారావుగారు, వారి సోదరులు - దంపతి సహితంగా వున్నారు.

ఆ సన్యాసి కాశీ నుండి వచ్చారు. అక్కడ కూడా ఆయనకొక ఆశ్రమం ఉంది. ఆయన పేరు శ్యాంప్రకాశ బ్రహ్మచారి. ఆయన కంభంపాడులో ఒక వేదపాఠశాల నిర్వహించారు. హోమియోపతి వైద్యం ఉచితంగా చేసేవారు. ఆ ఆశ్రమానికి దాదాపు 29 ఎకరాల భూమి విరాళంగా లభించింది. మామిడి తోట, మధ్యలో తాటాకు పాకలలో ఆశ్రమం, ముక్తినాథాలయం - భక్త సందోహం సందడితో కళకళలాడాయి.

అయితే కొంతకాలం తరువాత ఆ స్వామిజీ అక్కడ నుండి వెళ్లిపోయారు. ఒక ట్రస్టునేర్పరచి, ఆ భూమినంతా ట్రస్టు పేరరాసి, ఆశ్రమాన్ని వదిలివెళ్లారు. కొంతకాలం కొవ్వూరులో మరొక ఆశ్రమాన్నీ, వేద పాఠశాలను స్థాపించి, నిర్వహించారు. ఆ తరువాత పూరీ వెళ్లారు. అక్కడ ఆయన గోవర్ధనమఠపీఠాధిపతి అయ్యారు. అక్కడే సిద్ధిపొందారు.

ఆయన వెళ్లిన తర్వాత, కంభంపాడులో ఆశ్రమం, గుడి శిథిలమయ్యాయి. ఆశ్రమ స్థలం మొత్తాన్ని ప్రభుత్వం తీసికొని హరిజన కాలనీని నిర్మించింది.

మూడు ఆశ్రమాలను స్థాపించి, ఎంతో ఆస్తిపాస్తులకు హక్కుదారైనా, స్వామిజీ దేనితోనూ సంగం పెట్టుకోకుండా ఉండిపోయారు.

స్వామిజీ కంభంపాడు విడిచి వెళ్లిన తరువాత పదిహేను సంవత్సరాలకు మరొక యువ సన్యాసి ఆఊరు వచ్చారు. ఆయన కేవలం ఒక గోచీని మాత్రం ధరించేవాడు. ఉదయమే బావిలోకి దిగి, నీటిపై పద్మాసనం వేసుకొని కూర్చొని, తపస్సు చేసేవారు. పైకివచ్చి. గ్రామంలోని రాజలింగస్వామి ఆలయానికి వెళ్లి, గంట మ్రోగించి నమస్కారం చేసేవారు. ఎవరింటికో వెళ్లి భోజనం పెట్టమనేవాడు. తీరా వడ్డించేసరికి, లేచి ఎటో వెళ్లిపోయేవాడు. ఆయన ఆ గ్రామంలో మూడు నాలుగు నెలలకు పైగా ఉన్నా, ఎక్కడా భోజనం చేసినట్లుగానీ, కనీసం మంచినీళ్ళుల తాగినట్లుగానీ కనిపించలేదు. ఇంటికి వేసివున్న తాళాలు ఆయన వాటివైపు చూడగానే ఊడి క్రిందపడేవి. ఈ సంగతి ఊళ్లోవాళ్లు ఎన్నోసార్లు చూశారు. ఎవరెదురయినా పేరుపెట్టి పలకరించేవాడు. గత జీవిత సంఘటనలను చూసినట్లు చెప్పేవాడు.

ఒకసారి ఆ గ్రామంనుండి కొందరు బడిపిల్లలు వత్సవాయి స్కూలుకు వెళ్లి వస్తుంటే ఆయన తారసిల్లాడు. 'దేవుడిని చూస్తారా?' అని ఆయన వాళ్ళనడిగాడు. అందులో ఇద్దరు - వేమిరెడ్డి కోటిరెడ్డి, కొమరగిరి రామ్మూర్తి. ఈ ఇద్దరూ 'ఆ! చూస్తాం!' అన్నారు. అప్పుడాయన వాళ్ల తలపై చేయిపెట్టాడు. అంతే! మొత్తం అంతా ఒక బ్రహ్మాండమైన వెలుగుతో నిండిపోయింది. వాళ్లు భయపడి, కేకలు వేయగా ఆయన చేయితీసివేయటం, మళ్లీ అంతా మామూలుగా కావటం జరిగింది.

ఆ యోగి ఎలా వచ్చాడో అలాగే వెళ్లిపోయాడు: ఎటు వెళ్లాడో? ఆయన పేరు, ఊరు - ఎవరికీ తెలియదు.

భండారు పర్వతాలరావు

❀ ❀ ❀



వినాయకచవితి సందేశం

# సకలైశ్వర్య సంపన్నుడు గణపతి



"మానం హిత్వా ప్రియో భవతి
క్రోధం హిత్వా న శోచతి
కామం హిత్వార్థవాన్ భవతి
లోభం హిత్వా సుఖీ భవతి"

ప్రేమస్వరూపులారా!

మానవునికి అహంకారం వుండినంతవరకునూ, అతనిని ఎవరూ ప్రేమించరు. కట్టుకున్న భార్యనుంచి కన్న కుమారుని వరకున్నూ ప్రాపంచ నిమిత్తమై గౌరవింతురేగాని, అతనిలోని అహంకారమును చూచి వారు ఎవరునూ అసహ్యించుకొనకమానరు. ఈ అహంకారం మానవునియందు ఉండినంతవరకునూ అతనికి కూడా ఎట్టి ఆనందమూ లభించదు. కనుక మానవుడు మొదట అహంకారమును నశింపజేసుకోవాలి.

క్రోధం వుండేంతవరకు ఇతనికి ఆనందమనేది లభించదు. క్రోధం వుండినంతవరకూ దుఃఖమే.... దుఃఖమే.... ఏనాడు మానవుడు ఈ క్రోధమును నశింప జేసుకొనునో, అప్పుడే అతను సుఖమును అనుభవిస్తాడు.

వాంఛలుండినంత వరకునూ ఏవిధమైన సంపద అతనికి చేకూరదు. ఏనాడు మానవుడు వాంఛలను వదులునో, అప్పుడే సర్వసంపదలూ అతనికి వస్తాయి.

లోభం వుండినంత వరకునూ మానవునకు సుఖమనేది కనిపించదు. ఏనాడు లోభమును దూరం గావించుకొనునో, ఆనాడే మానవుడు సర్వసుఖములనూ అనుభవిస్తాడు.

ప్రపంచమంతయూ కూడనూ అణుశక్తితో ఆధారపడి వుంటున్నది.

"అణువు కంటెను సూక్ష్మమై అణువుయగుచు
ఘనము కంటెను స్థూలమై ఘనము అగుచు."

ఈ జగత్తంతయూ ఘనమునందుగాని, సూక్ష్మమందుగాని ఆధారపడి వుండటానికి అణుశక్తి యొక్క సమూహమే దీనికి మూలకారణము. అణువుయే ఆత్మ. ఆత్మయే అణువగును. కనుక ఈ అణువు యొక్క శక్తిని ఎవరూ గుర్తించుకొనలేరు. అణువనగా శక్తి. సెకన్ల యొక్క సమూహమే. పలికే పలుకు, చూచే చూపు, వినే శబ్దము, నడిచే నడక - సర్వమూ అణుస్వరూప శక్తియే. ప్రతిప్రాణి యొక్క చలనము కూడనూ అణువు యొక్క సమూహమే. ఏది అనుభవించినా అది అణువు యొక్క ప్రభావమే. ఈ

## భగవాన్ సాయి దివ్యబోధ

సత్యమును సైంటిస్టులు వెయ్యి సంవత్సరముల తరువాత ఈనాడు తెలుసుకోగలిగారు. అనగా అణువు యొక్క శక్తిని గుర్తించడానికి సైంటిస్టులకు వెయ్యి సంవత్సరాల కాలం పట్టింది. కాని ఏనాడో బాలుడైన ప్రహ్లాదుడు దీనిని ఆనాడే గుర్తించాడు. "ఇందు కలడందు లేడను సందేహము వలదు...... అందందే కలడు" అని ఆనాడే ప్రహ్లాదుడు స్పష్టం చేశాడు. ప్రహ్లాదుడు ఎట్టి పరిశోధనలు గాని, పరిశీలనలుగాని సలుపలేదు. నిర్మల నిశ్చలమైన చిత్తమునకు సర్వమూ సత్యస్వరూపమే గోచరిస్తుంటుంది. 'ఆత్మయే అణువు, అణువుయే ఆత్మ' అను సత్యమును గుర్తించిన వ్యక్తి ప్రహ్లాదుడు. దీనిని ఆధారం చేసుకొనిన ప్రపంచమంతయూ దైవ స్వరూపమే. ప్రతి పదార్థము నందు కూడనూ అణువు యొక్క శక్తియే ప్రసరిస్తూ ఉంటున్నది. అణువు లేని వస్తువు గాని, అణువు లేని స్థానముగాని, అణువుగానటువంటి రూపము గాని ఎక్కడా కానరాదు. సమస్త పదార్థములూ, సమస్త శక్తులూ అణు స్వరూపములే. ఈ భూమి అంతయూ అణుమయమే. ఈ జగత్తులో ప్రతి వ్యక్తియూ ఒక చిన్న జనరేటరే. ఇతని

యందున్న అయస్కాంతమే విద్యుచ్ఛక్తిగా మారుతున్నది. ఆ విద్యుచ్ఛక్తి ప్రభావం చేతనే మనిషి నడవగలుగుతున్నాడు, మాట్లాడగలుగుతున్నాడు, వినగలుగుతున్నాడు, చూడగలుగుతున్నాడు, తినగలుగుతున్నాడు. ప్రతి మానవుని యొక్క హృదయము ఒక రేడియో సెట్టు. ప్రతి మానవుని యొక్క శక్తి ఆటమిక్ శక్తియే. ఇవి కాంతి కిరణములు. ఈ కాంతికిరణముల ద్వారానే ఈ అయస్కాంతం మరింత అధికమవుతూ వస్తున్నది. దీనిని పురస్కరించుకొనియే ఐన్‌స్టీన్ Matter మరియు Energy రెండు ఒక్కటేనని నిర్ణయించాడు. ఈ జగత్తంతా అణుమయం అన్నారు సైంటిస్టులు. బ్రహ్మమయం అన్నారు వేదాంతులు. పేర్లు మాత్రమే తేడా. Scientist చెప్పిన దానికి Saint చెప్పినదానికి ఏమాత్రం బేధం లేదు. ఏకత్వమే.

'గణపతి' అనే పదమున్నది. 'గ' అనగా బుద్ధి. 'ణ' అనగా జ్ఞానము. అనగా జ్ఞాన విజ్ఞానములకు 'పతి' అయినటువంటివాడే 'గణపతి'. గణపతి కూడా శక్తి సమూహమే. ఈ విధమైన అణుశక్తి కూడిక వలననే 'గణపతి' అనే పేరు సార్ధకమైంది. ఇదియేగాక సమస్త గణములకు అధిపతి కావటం వలననే ఇతనికి 'గణపతి' అని పేరు వచ్చింది. సమస్త శక్తులకు అతను అధిపతి. ఇతనినే 'వినాయక' అని పిలుస్తూ వచ్చారు. ఇతనికి వేరే నాయకుడు లేడు. సర్వులకూ నాయకుడు ఇతనే. ఇతనినే 'విఘ్నేశ్వరా'! అని పిలుస్తూ వచ్చారు. విఘ్నములు లేకుండా చేసేవాడు. సకల ఐశ్వర్య స్వరూపుడు విఘ్నేశ్వరుడు. ఈ విధంగా అంతరార్థములను విచారణ చేసినప్పుడు, అన్నియూ ఆతనియొక్క శక్తి స్వరూపములేనని అర్థమవుతుంది. ఏమిటి ఈ సకలైశ్వర్యము? శబ్ద బ్రహ్మము, చరాచరములు, జ్యోతిర్మయము, విద్యా నిలయము, అణుమయము - సర్వమూ ఆతని శక్తులే.

జ్యోతిర్మయము - ఇది కూడా అణువు యొక్క స్వరూపము. ఈ [illegible]తి అనేటటువంటిది ఎక్కడ ఉంటున్నది? ప్రతి ప్రా[illegible]ో విద్యుచ్ఛక్తి రూపం ప్రసరిస్తూ ఉంటున్నది. లోక[illegible] ఈ విద్యుచ్ఛక్తి లేని ప్రాణి అంటూ లేదు. కనుక ప్రతి ప్రాణి యొక్క శరీరమూ ఒక విధమైన జనరేటరే. ఈ దేహమంతయూ ఒక విధమైన అయస్కాంత స్వరూపమే. ప్రకృతి కూడనూ అయిస్కాంత స్వరూపమే! అయస్కాంతము నుండి అయస్కాంతమే వస్తుంది గాని మరొక కాంతి రాదు. అయితే వీటి రూపములు వేరు వేరు కావచ్చును గాని శక్తి ఒక్కటే. బల్బు వెలిగినా, ఫాన్ తిరిగినా, మిషన్ పనిచేసినా దానిలోని కరెంట్ ఒక్కటే. ప్రతి మానవుని యందున్న విద్యుచ్ఛక్తిని ఎక్సరే కిరణాలుగా భావించవచ్చు. దీనినే "Reflection of inner being" అన్నారు. పలికే పలుకు, చూచే చూపు, వినే శబ్దము, నడిచే నడక, తినే తిండి, త్రాగే నీరు అన్నీ కూడనూ విద్యుచ్ఛక్తి యొక్క లక్షణములే. ఈ జలమునందు కూడనూ 'బడబాగ్ని' అనే శక్తి ఉంటున్నది. అదియే విద్యుచ్ఛక్తి. ఏ జలము ఏ అగ్నిని ఆర్పగలుగుతుందో, ఆ ఆర్ప గలిగేటటువంటి జలము నందే ఈ విద్యుచ్ఛక్తి ప్రసరిస్తూ-ఉంటున్నది. కనుకనే ఈ జగత్తంతా 'సర్వం బ్రహ్మమయం' అన్నారు. దీనిని పురస్కరించుకొనియే వేదాంతం 'సర్వ ఖల్విదం బ్రహ్మ' అన్నది. 'విశ్వం విష్ణుమయం జగత్' అన్నారు. కనుక గణపతి వేరు, విష్ణువు వేరు, శివుడు వేరు, శక్తి వేరు, మానవుడు వేరు-అను బేధములను మనం దూరం చేయాలి. సర్వులయందునూ మానసత్వం సమానమై ఉంటున్నది. ఇది ప్రాకృతమైన

శక్తికి సరియైనటువంటి స్వరూపంగా నిరూపిస్తుంటుంది. అయితే ఇది ప్రవృత్తి యొక్క లక్షణమే గాని నివృత్తి యొక్క లక్షణం కాదు. ఈ నివృత్తి అనేటటువంటిది రూపరహితంగా సర్వుల యందూ ప్రవహిస్తుంటుంది. అదియే అణుశక్తి. ఈ భౌతికమైన ప్రాకృత శక్తిని పోషించే నిమిత్తమై ఈ అణుశక్తియందు అనేకరకమైన మార్గములు సూచిస్తూ వచ్చారు.

ఇది వినాయక చవితి దినం. ఈనాడు వినాయకునికి ఏది అర్పితం చేస్తున్నాం? ఏమాత్రం తైల సంస్కారం లేని వస్తువులనే ఈనాడు వినాయకునికి అర్పితం గావిస్తున్నాం. కుడుములు, ఉండ్రాళ్లు నైవేద్యం పెడుతాం. దీనిలో కలిపే బియ్యంపిండిలో గాని, బెల్లంలో గాని తైలం ఎక్కడా కనిపించదు. దీని వలన వచ్చే లాభమేమిటని విచారిస్తే తైల సంస్కారం లేని పదార్థములు అతి త్వరగా జీర్ణమై పోతాయి. నువ్వులు వలన వాత పిత్త శ్లేష్మాదులు తగ్గి పోతాయి. బెల్లం వలన కంటిచూపు అభివృద్ధి అవుతుంది. ఇవన్నీ ఆరోగ్యం నిమిత్తం ఏర్పడిన ప్రసాదములే గాని కేవలం నైవేద్యం నిమిత్తం ఏర్పడిన ప్రసాదములు కావు. దేహములో వున్న అణుశక్తి, ఈ పదార్థముల శక్తి చేత పవిత్రంగావించి, తద్వారా అమిత ఆయుష్షును అభివృద్ధి గావించవచ్చును.

వినాయకునికి తెలివి తేటలు చాలా గొప్పవి. ఆ రూపమే చిత్రవిచిత్రంగా కనిపిస్తుంటుంది. ఆ రూపమును చూచి చాలామంది ఆనందిస్తుంటారు. వినాయకునికి ఏనుగుతలను ఎందుకు పెట్టారు? గజమునకు తెలివి తేటలు చాలా గొప్పవి. అడవులలో సంచరించటం చాలా కష్టం. కాని ఒక్కసారి ఏనుగు కనుక ప్రయాణం చేసిందంటే చక్కటి దారి ఏర్పడుతుంది. అప్పుడు ఎవరైనా ఆదారిన సులభంగా నడువవచ్చు. కనుక జీవితారణ్యము లోపల అనేక కష్టములు, నష్టములు, దుఃఖ ములు, విచారములు వంటి పొదలువున్న అరణ్యముల యందు కూడను ఏనుగు ముందు బయలుదేరితే అనగా తెలివి తేటలతో ముందు నడుస్తే ఎంతైనా సులభంగా మనం ప్రయాణం చేయువచ్చును. గజము శిరస్సును ధరించినవాడు కనుకనే గణపతికి తెలివితేటలు ఎక్కువన్నారు. సాక్షాత్ శివుడు కూడా గణపతి తెలివి తేటలను చూచి ఆశ్చర్యపడి "శివపూజ కంటె ముందు గణపతి పూజ చేయుదురుగాక!" అని వరమును ప్రసాదించాడు. తనకంటె తన కుమారునికి ఉన్నత స్థానాన్ని అందించిన తండ్రి పరమేశ్వరుడు. కనుక 'గణపతి' అనగా సామాన్యుడు కాదు. సమస్త శక్తులతో కూడిన స్వరూపం. సమస్త తెలివితేటలతో కూడిన స్వరూపం. సరస్వతి కూడా అతని పొట్టలోనే చేరి ఉన్నది. అలాంటి గణపతి స్థానము సకల ఐశ్వర్య స్వరూపమైన స్థానం.

ఈనాడు అనేకమంది గుణవంతులు, ధన వంతులు, విద్యావంతులు అందరూ మొదట గణపతిని పూజిస్తుంటారు. సరస్వతి అనుగ్రహమునకు పాత్రులు కావాలని విద్యార్థులు గూడ గణపతినే ఆరాధిస్తుంటారు. విద్యలో ఎట్టి విఘ్నములు కలుగకుండా సాధించేట్లుగా అనుగ్రహమును ప్రసాదించమని పుస్తకములు విఘ్నేశ్వరుని ముందు పెట్టి పూజిస్తుంటారు. ఈనాడు ఎవరైనా 'గానసభ' జరపాలనుకుంటె ముందు "వాతాపి గణపతిం భజే" అని ప్రార్థన చేస్తారు. ఆవిధంగా మొదట గణపతిని పూజిస్తే సర్వవిధములైన శక్తులను వారు పొందుతారు. గణపతి కేవలం ఒకవిధమైన కార్యములకు, శుభములకు,

## సుభాషితములు

"అశ్వంనైవ గజంనైవ
వ్యాఘ్రం నైవచ నైవ చ
అజాపుత్రంబలి దత్వాంత్
దేవో దుర్బల ఘాతకః"

గుఱ్ఱమునుగాని, ఏనుగునుగాని బలి ఈయరు. పెద్దపులిని అంతకంటెను ఈయరు మేకపిల్లను మాత్రమే బలిఇత్తురు. దేవుడు కూడ బలహీనులనే నాశనము చేయునుగాని బలాఢ్యుల నేమియూ చేయడు.

కర్మలకు మాత్రమే కాదు. శుభాశుభములకు రెండింటికీ గణపతే పతి. ఏది జరిగినా అతనికి శుభమే. సర్వులకూ శుభమును అందించేటటువంటివాడు గణపతి. సర్వ ఐశ్వర్యములను కలిగించేటటువంటివాడు గణపతి. బుద్ధి, విజ్ఞానములను ప్రసాదించేటటువంటివాడు గణపతి. తెలివితేటలను పెంచేటటువంటివాడు గణపతి. కనుక అందరూ గణపతిని పూజిస్తారు. అసలు విద్యార్థులకు ఎటువంటి విద్య కావాలి? సద్గుణంబులు, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనములు - నేర్పునదే విద్య. అట్టి విద్యను నేర్పేటటువంటివాడే గణపతి. కనుక సర్వులకు 'పతి' అయినటువంటివాడు గణపతి. ఇలాంటి గణపతిని మనం ఏవిధంగా ప్రార్థించాలి? ఓ భగవంతుడా! నాకు ఈ కార్యం, ఆ కార్యం కావాలని ప్రార్థించరాదు. ఏకార్యమూ వద్దు. నీవే నాకు కావాలి అని ప్రార్థించాలి. గణపతి మనకు స్వాధీనుడైపోతే, సర్వమునకూ మనం పతులమైపోతాం. బంగారం కనుక మన చేతిలోవుంటే ఏరకమైన నగలనైనా చేయించు

## మహిళామహస్సు

ఒకచోట కొండలనొక చోట బండల
పిండి కొట్టంగ తోడు నుండునెవరు?
ఒక చోట పరువునై యొకచోట నెఱవునై
గారవమ్మునెసంగు గురితయెవరు?
ఒకచోట కష్టాల నొకచోట సౌఖ్యాల
పాల్పంచుకొను నర్ధభాగమెవరు?
ఒకచోట చేదోడు నొకచోట వాదోడు
గాసాయపడు కార్యకర్తఎవరు?
నేరుపున సర్వశక్తులు ధారవోసి
కరిగిపోయెడి కర్పూర కళికయెవరు?
పిల్వంగా బల్కుదైవమై వెలయునెవరు?
భరతమహిళా మణిన్ మదిన్ బ్రస్తుతింతు.

**- ఇక్కుర్తి ఆంజనేయులు**

కొనవచ్చును. గణపతి బంగారంలాంటివాడు. మన భావములు, కోరికలు కొన్ని ఆభరణములవంటివి. కనుక ప్యానుకావాలి, ఉద్యోగం కావాలి అని కోరికలు కోరకూడదు. "విఘ్నేశ్వరా! నాకార్యములకు ఎట్టి విఘ్నములూ కలుగకుండా చూడు. దీని నిమిత్తమై నిన్ను పూజిస్తున్నాను." అని అర్థించాలి.

ఈనాడు గణపతి తత్త్వమును ఎవరూ సరిగా అర్థం చేసుకొనటంలేదు. కేవలం ప్రాకృతమైన స్వరూపాన్ని మాత్రమే అర్థం చేసుకొని, ప్రాకృతమైన పదములకు మాత్రమే అర్థం చెప్పుకుంటూ కాలమును వ్యర్థం చేస్తున్నారుగాని, అంతర్భావములను గుర్తించి, అంతరార్థములను తెలుసుకొని నిజమైనటువంటి శాంతిని పొందేవారు బహుతక్కువగా కనిపిస్తున్నారు. రామ భక్తులు రాముని జన్మదినోత్సవాన్ని పండుగగా చేసుకొని ఆనందాన్ని అనుభవిస్తున్నారేగాని ఆయనలోని పవిత్రమైన గుణాలను తీసుకోవటంలేదు. రామభక్తులు కావాలనుకుంటే రాముని గుణములను తీసుకొని ఆచరణలో పెట్టాలి. కృష్ణభక్తులు కావాలనుకుంటే కృష్ణునివలె నిరంతరం ఆనందంగా నవ్వుతూ ఉండాలి. స్వామిభక్తులు కావాలనుకుంటే నిరంతరం ప్రేమమయులుగా మారాలి. అందరినీ ప్రేమించాలి. ఎవ్వరినీ ద్వేషించకూడదు. ఈవిధమైన భావాలను హృదయంలో పెంచుకోవాలి. పరిపూర్ణంగా విశ్వసించాలి. కనుక గణపతితత్త్వము చాలా అంతరార్థముతో కూడినటువంటిది.

భగవంతుడు ఏది చెప్పినా అర్థ సహితమైనటువంటిదే. పవిత్రమైనటువంటి అర్థము కలిగినటువంటిదే. సాయినాథ్ చెప్పాడు. "ఎవరో భక్తుడు వెళ్లుతుంటే Wait...... Wait అన్నాడు స్వామి." కాని ఆభక్తుడు Wait (కాచుకొనియుండు) చేయడానికి ఓపికలేక ఇంటికి వెళ్లిపోయాడట. నెలల తరబడి ఇంటివద్ద Wait చేశాడు. ఆ Wait యిక్కడ చేయలేదు. అక్కడ ఎంత Wait చేసినా ఫలించలేదు. తిరిగి యిక్కడకు వచ్చాడు. అప్పుడు స్వామి " నేను వద్దంటే ఎందుకు వెళ్లావ్?" అన్నారుట. ప్రతిమాటలో ఒక అంతరార్థం

ఉంటుంది. కాని కొంతమంది వెర్రి (మూఢంగా)గా దానిని పాటిస్తుంటారు. ఉదాహరణకు కొంతమంది భక్తులు కూర్చొని ఉంటారు. నేను మధ్యలో వెళ్లుతుంటాను. స్వామీ! నాకు అదికావాలి, ఇదికావాలి అని అడుగుతుంటారు. Wait.... Wait ..... Sit Down అంటుంటాను. పాపంవాళ్ళు అనుకుంటారు. కూర్చోమని Wait చేయమన్నానేమో అనుకొని, అందరు వెళ్లిపోయినా వాళ్లు కూర్చొనే ఉంటారు. సహజంగా ఎవరైనా లేస్తుంటే కూర్చో! కూర్చో! అంటుంటాను. తొందరపడకండి! కాచుకొని కూర్చోండి! అంటుంటాను. ఆ అర్థమును తీసుకొని అందరు వెళ్లిపోయినా వారు కుర్చునే ఉంటారు. వాలంటీర్సు వెళ్లి 'వెళ్లండయ్యా!' అంటే స్వామి కూర్చోమన్నారంటారు. సమయ సందర్భాన్ని పురస్కరించుకొని ఆమాటను అర్థం చేసుకోవాలిగాని యథాతథంగా కాదు. దేశకాల పరిస్థితుల ప్రభావమును పురస్కరించుకొని అర్థం చేసుకోవాలి.

భగవంతుడు చేసే ఉపదేశములకు అంతరార్థములను గ్రహించలేక, ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థమును తీసుకొని, ఆ అర్థాన్ని అనర్థాలుగా పెంచి, అనర్థాలను నానార్థాలుగా పెంచి, నానార్థములలోని యదార్థమును వదిలిపెట్టి, అనర్థాన్ని మాత్రమే తీసుకుంటారు. అనర్థాలను తీసుకొని అవస్థలు పడేటటువంటివారు కొందరు. పవిత్రమైన అర్థములను తీసుకొని ఆనందించేటటువంటివారు మరికొందరు. భగవంతుని యొక్క శక్తి సామర్థ్యములను చక్కగా అర్థం చేసుకుంటే అణుస్వరూపుడే భగవంతుడు అని అర్థమవుతుంది. దీనినే గోపికలు కూడా ఆనాడు చెప్పారు. "అణువు కంటె అతి సూక్ష్మరూపుడవు, ఘనముకంటె అతి గణనీయుడవు ---- నిను కనుగొనగలమా! కృష్ణా!" అన్నారు గోపికలు. ఈవిధంగా దైవతత్త్వమును ఎవరి శక్తిసామర్థ్యములను బట్టి వారు అర్థంచేసుకుంటూ వచ్చారు.

ప్రాకృతమైన ప్రేమలు ఉంటుంటాయి. కాని దివ్యమైనటువంటి ప్రేమ ఒక్క భగవంతునిది తప్ప మరెవ్వరిదీ కాదు. అటువంటి దివ్యప్రేమను ప్రతి ఒక్కరూ కోరాలి. ఈనాడు లోకంలో అందరూ ప్రేమిస్తున్నట్లుగానే కనిపిస్తుంటారు. ఏది అసలు ప్రేమో ఏది కాదో గుర్తించటానికి వీలుకాదు. తల్లిదండ్రులకు ప్రేమ ఉంటుంది. వారిని మనం ఆనందపెట్టాలి. సాధ్యమైనంత వరకు వారిని సంతృప్తి పరచడానికి ప్రయత్నంచేయాలి. కాని దైవప్రేమను మాత్రం మరవకుండా చూచుకోవాలి. అదియే శాశ్వతమైనటువంటిది, సత్యమైనటువంటిది, నిత్యమైనటువంటిది. ఈనాడు ప్రేమించేటటువంటి తల్లిదండ్రులు కూడా ఏదో ఒకరోజున మరణించవచ్చును. కాని దైవమునకు ఎట్టి మరణమూ లేదు. అలాంటి అమృత స్వరూపుడైనటువంటి దైవమును మనం నిరంతరం ప్రేమించాలి. దాంతోపాటు తల్లిదండ్రులను కూడా ప్రేమించండి. సర్వులనూ ప్రేమించండి. అయితే దైవమును మాత్రం చలించనటువంటి భక్తితో ప్రేమించండి. అటువంటి నిత్య సత్యమైనటువంటి ప్రేమను ఎప్పుడూ మనం అభివృద్ధి పరచుకోవాలి. అట్టి ప్రేమయే దైవ స్వరూపము. అట్టి ప్రేమయే గణపతి స్వరూపము. అట్టిప్రేమయే సర్వస్వరూపము. నీ స్వరూపము కూడనూ

## భారతి

మన భారతదేశమునకు ఈపేరు ఎట్లా వచ్చింది? రాముని తమ్ముని పేరు 'భరతుడు' కనుక అతని పేరు ఈ రాజ్యమునకు పెట్టారనుకుంటున్నారు కొందరు. ఇది పొరపాటు. ఇది ఎవ్వరి పేరుకాదు. దైవం పేరే. ఎవరికైన ఒక పేరు పెట్టాలంటే, ఆపేరుకు ముందు అనగా ఇంతకు పూర్వమే ఈ పేరు ఉండి ఉండాలి గదా! కాని ఇది ఎవరికి పెట్టనటువంటి పేరు? ఏవిధంగా? "సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి, విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమే సదా. పద్మ పత్ర విశాలాక్షీ పద్మకేసరవర్ణినీ, నిత్యం పద్మాలయాందేవీ సామాం పాతు సరస్వతీ. భగవతి భారతి పూర్ణేందు బింబాననా" అన్నారు. భారతి పేరు సరస్వతి పేరే. అనగా పరిపూర్ణమైనటువంటి స్వరూపము యొక్క పేరే ఈ 'భారతి'. గానమునకు మూలం శృతి, తాళం, రాగం. 'భా' అనగా కేవలం భాగ్యముతో కూడినటువంటిది కాదు. భావంతో కూడినటువంటిది. 'ర' అనగా ఆభావం రాగముతో చేరినటువంటిది. ఆ రాగము తాళమునకు తప్పు పోనటువంటిది. కనుక భావ, రాగ, తాళములతో కూడినటువంటిది కనుకనే 'భారతి' అని పేరు పెట్టారు.

-బాబా

భగవంతుని స్వరూపమే. నీకునీవే భగవంతుడవని భావించుకో, తప్పు ఏమీలేదు. శారీరకంగా నీవు మానవుడివేగాని, ఆత్మ దృష్టిలో నీవుదైవమే. కనుక 'అహం బ్రహ్మాస్మి' అనే భావంతో నీవు జీవించు. శరీర భావంతో నేనొక వ్యక్తి కాని మానసిక స్థితిలో నేను దాసుడను. హనుమంతుడు కూడా ఇదే చెప్పాడు. రాముడు ఒక పర్యాయం హనుమంతుని పిలిచి "హనుమా! నీవు నన్ను ఏరీతిగా ఆరాధన చేస్తున్నావు?" అని అడిగాడు. "స్వామీ! శారీరకంగా నేను మీ దాసుడను, మీరు నా ప్రభువు" అని భావిస్తున్నాను. మానసికంగా "నీవే నేను, నేనే నీవు" అనుకుంటున్నాను. ఆత్మరీత్యా 'మనమిద్దరం ఒక్కటేను' అన్నాడు. ఇద్దరుకానే కాదు వలనిద్దరం ఒక్కడనే అన్నాడు. ఈ విధంగా మూడు రకములు భావాలతో మనం ప్రేమిస్తున్నాం. ఈ మూడురకముల మంచివే. కాని కట్టకడపటికి మాత్రం మనమిద్దరం ఒక్కటేననే సత్యానికి మాత్రం రావాలి. దేహాలు వేరు వేరుకావచ్చును. కాని ఆత్మ ఒక్కటే. దీనినే 'ఏకంసత్ విప్రా బహుదావదంతి' అన్నది వేదం. విఘ్నేశ్వరుని పండుగ అంటే సర్వ సామాన్యమైన పండుగగా మనం భావిస్తున్నాం. సమస్త దేవతల యొక్క స్వరూపం, సమస్త దేవతల యొక్క శక్తి తత్త్వము. అంతా విఘ్నేశ్వరుని యందే ఉంటున్నది. పండుగ రోజున మాత్రమే పూజిస్తే ప్రయోజనం లేదు, నిరంతరం పూజిస్తూరావాలి. క్షణం క్షణం దైవత్వాన్ని చింతిస్తూరావాలి. ఏ పని చేస్తున్నా, ఎక్కడికి వెళ్లినా అంతా 'భగవత్ ప్రీత్యర్థం' చేస్తున్నానని భావించుకో. ఏదో ఒక వస్తువు యొక్క తృప్తి కోసం చేస్తున్నామనుకుంటాం. ఇది చాలా పొరపాటు. ఏమి చేసినా నీతృప్తి కోసం నీవు చేస్తున్నావు. అంతేగాని పదార్థ తృప్తి కోసంకాదు. పదార్థ తృప్తి కోసం ఎవరూ చేయటంలేదు. నీవు ఒక యాపిల్ కొనుక్కొని తినాలనుకున్నావు. యాపిల్ తృప్తి కోసం యాపిల్‌ను తింటున్నావా? నీ తృప్తి కోసం యాపిల్‌ను తింటున్నావు. ప్రతి కార్యం నీ తృప్తికోసం నీవు చేస్తున్నావుగాని, ఇంకో పదార్థం తృప్తి కోసంకాదు. కనుక ఏ పనిచేసినా దైవప్రేమతో ఆపని చేయి. సర్వమూ నీకు సిద్ధింపజేస్తుంది. సర్వమూ నీకు విజయాన్ని అందిస్తుంది. సర్వమూ నీకు ఆరోగ్యాన్ని, ఆనందాన్ని చేకూరుస్తుంది. సర్వమూ భగవంతుడుగానే భావించుకో!

*(ది. 25-8-98న వినాయకచవితి పండుగ దినాన ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

**శ్రీవాణి పాఠకులకు, ప్రకటనదారులకు, చందాదారులకు దీపావళి శుభాకాంక్షలు.**

# వృద్ధాప్యము

కదిలే కాల చక్రం - నిత్య పరిణామ శీలంగా, మానవ జీవితాన్ని శాసిస్తూ ఉంటుంది. ఆ శాసనం పేరు వయస్సు. బాల్యం, యౌవ్వనం, వార్ధక్యం - అనే మూడు దశలలో నడిపిస్తూ మనిషిని అత్యంత ప్రభావితం చేస్తుంది ఈ వయోలక్షణం.

ఇప్పుడు మనం సమాలోచిస్తున్నది. ఈ జీవన దశలలో చివరిదైన వృద్ధాప్య దశను గురించి, దివసాంత ప్రశాంత సాంధ్య భూమికలో సేద తీర్చుకొనే సాయం సంధ్యా సూర్యుని తలపింప చేసే ముదిమి వయస్సు గురించి.

బాల్య యౌవ్వనాలను వాటి, నడిమి వయస్సునుదాటి ముదిమికి చేరువవుతున్న మనిషి - అలసి సొలసి-జీవితంలోని తేజస్సునూ, ఓజస్సునూ పోగొట్టుకొన్న నైరాశ్య జీవితం, బ్రతుకు వేసటలో ఒడలిపోయిన బహుళ ప్రాణిలం అగుపిస్తాడు.

శరీరంలో స్వస్థత తప్పి శక్తి లోపిస్తుంది. ఏదో ఒక రుగ్మత వెంటపడుతుంది. నిరుత్సాహం పెరుగు తుంది. తన తోటివారు ఒక్కొక్కరే కనుమరుగవుతుంటే చెప్పరాని దిగులు పుడుతుంది. తన వారందరికీ తాను భారం అవుతానని ఏర్పడుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే - శారీరక, మానసిక ప్రవృత్తులన్నింటిలోనూ ఒక నిస్తేజం ఆవరించే దశ - వార్ధక్యదశ.

మహాభారతంలో ఒక ముచ్చటైన ఉపాఖ్యానం ఉంది. కారణాంతరాల వల్ల యయాతి అనే రాజుకు ముసలితనం అనుభవించవలసిన శాపం తగులుతుంది. అతని కుమారులలో ఏ ఒక్కడైనా ఆ జరాభారం స్వీకరిస్తే, తండ్రికి నిత్యయౌవనం కలుగుతుందన్న ఉపశాంతి వచనమూ వినిపిస్తుంది. ఇంతటి కఠినమైన త్యాగానికి సిద్ధపడి చిన్నవాడైన 'పూరుడు' అనే కొడుకు తండ్రి నుంచి జరా భారాన్ని స్వీకరిస్తాడు. సహస్ర వర్షాల కాలం సమస్త సుఖాలూ అనుభవించి తృప్తి తీరిన తర్వాత - కొడుకుకు తన యౌవ్వనం ఇచ్చి - అతడినుండే ముదిమిని స్వీకరించడం - అదంతా ఒక చిత్రమైన కథ! అసాధ్యమే అనిపించినా - ఈ కథ - మనల్ని తీవ్రంగా కదిలించి ఆలోచింపచేసే కథ! అటువంటి నిత్య యౌవన స్థితివల్ల కలిగే లాభనష్టాలు ఎటువంటివి? ఉత్పన్నమయ్యే సమస్యలు ఎట్లా ఉంటాయి?

ఆధునిక కాలంలో - శరీర విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం వల్ల మనిషి ఆయుః ప్రమాణం పెరిగింది. వృద్ధులై ఎక్కువకాలం జీవిస్తున్న వారి సంఖ్య పెరుగుతున్నది.

ఏదో ఒక రోజున ప్రతివారూ ఎదుర్కోవలసిన దశ వృద్ధాప్య దశ. వృద్ధాప్య సమస్యల్ని గురించి వ్యక్తిపరంగానూ, సామాజిక పరంగానూ సరికొత్త అవగాహనతో ఆలోచించవలసిన అవసరం ఉన్నది.

## సి. వేదవతి

వీలయినంత మృదువుగా, తేలికగా ఈ జరాభారాన్ని మోయడానికి ఒక ప్రశాంతమైన చిత్త వృత్తిని అలవరచుకోవలసి ఉంటుంది. మనస్సుకూ శరీరానికీ తగిన వ్యాపకం కలిగించుకోవటంద్వారా, అలజడీ, ఆందోళనా తగ్గుతుంది. అప్పుడు వృద్ధాప్యం ఒక శాపం అనిపించదు. సరికదా - అది కూడా ఒక అనుభవయోగ్యమైన దశగా మారుతుంది.

ప్రపంచ చరిత్రలో - ఎందరో మేధావులు తమ వృద్ధాప్య దశలోనే తమతమ రంగాలలో కృషి చేసి విజయాలు సాధించినవారు కనిపిస్తారు. వారికి అంతటి చేతన ఎట్లా సాధ్యం అయింది?- అని ఆలోచిస్తే - అదంతా వారి మానసిక స్థితి ప్రభావం అయి ఉండవచ్చని అర్థం అవుతుంది. వృద్ధాప్యాన్ని మనస్సుకు అంటించక ఉత్సాహంగా జీవించడం ఎట్లానో ఇటువంటివారి ఆదర్శమయ జీవితాలు మనకు స్పష్టం చేస్తాయి.

తన జీవితానుభవసారాన్ని ఇతరులకు పంచి ఇవ్వడంలో, శక్తి ఉన్నంతవరకూ శరీర మనో వ్యాపారాలన్నిటా చైతన్యం నింపుకోవడంలో పండిన వయస్సులోనూ మనిషి సాధించగలిగినది ఎంతో ఉంది. అది - వృద్ధాప్యాన్ని కూడా నియమించే మనోమయ సాధన ద్వారా సాధ్యం అవుతుంది.

ఆ సాధన - జీవన సంధ్యను కూడా సౌందర్య మయం చేస్తుంది! ☆

# వివేకము

విషయపరిశోధనకు విజ్ఞానం ఎంత అవసరమో, పరిశోధనా ఫలితాన్ని వినియోగించుకోవటానికి 'వివేకము' అంత అవసరం. అయితే ఈనాడు విజ్ఞాన శాస్త్రరంగంలో వివేకమును విస్మరిస్తున్నారు. వివేకరహితంగా ఎక్కడ పడితే అక్కడ అణ్వాయుధ పరిశోధనలు జరపటంవలన తరచుగా ఉప్పెనలు, తుఫానులు, భూకంపాలు సంభవిస్తున్నాయి. విచక్షణారహితంగా అడవులను నరకటం వలన వర్షాలులేక, పంటలు పండక దేశం తరచుగా కరువుకాటకాలకు గురి అవుతున్నది. కొందరు శాస్త్రజ్ఞులు వివేకరహితంగా ప్రవర్తించడంవలన కొన్ని ప్రాంతాలు తరచుగా అతివృష్టి అనావృష్టులకు బలియై పోతున్నాయి. మేధాశక్తికి, నైపుణ్యానికి మధ్య సమతూకం లోపించటం వలన అనేక అరిష్టాలు సంభ విస్తున్నాయి, మారణహోమాలు చెలరేగుతున్నాయి.

జగత్కళ్యాణమునకు విజ్ఞానం ఎంత అవసరమో, దానిని ఉపయోగించటానికి వివేక జ్ఞానం కూడా అంత అవసరం. వివేకంలేని విజ్ఞానం వలన, విచక్షణ చూపించలేని జ్ఞానంవలన ఏమాత్రం ప్రయోజనంలేదు. వివేకం వేరు, విద్యవేరు. మంచికి, చెడుకు మధ్య వ్యత్యాసమును తెలుసుకోవటమే వివేకలక్షణం. అట్టి వ్యత్యాసమును తెలిసికొనిన పిదప; దేనికి, ఎంత, ఎప్పుడు, ఎటువంటి ప్రాముఖ్యత యివ్వాలో నిర్ణయించగల శక్తి సామర్థ్యములనే 'విచక్షణాజ్ఞానం' అని అంటారు. విచక్షణా జ్ఞానం వివేకజ్ఞానంలోని అంతర్భాగం మాత్రమే. వివేకంలేని వార్కి సన్మార్గం ఒంటపట్టదు. మనంచేయు ప్రతి పనిలోనూ వివేకాన్ని ప్రదర్శించడం విజ్ఞత లక్షణం.

ఉదాహరణకు అణు పరిశోధనలద్వారా ప్రపంచాన్ని భస్మీపటలం చేయగల అణ్వాయుధాలనూ తయారుచేయవచ్చును. అదే అణుశక్తి ద్వారా కొన్ని కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని తయారుచేసి తద్వారా పరిశ్రమలను, వ్యవసాయమును అభివృద్ధిపరచి దేశమును సస్యశ్యామలం గావించవచ్చును. ఒక చంప అణ్వాయుధాలు వినాశనానికి దోహదం చేస్తే, అదే అణుశక్తితో కోట్లాది ప్రజానీకానికి పనికల్పించవచ్చును. వివేకం ఇక్కడనే ఉపయోగ పడుతుంది.

విజ్ఞానమునకు వివేకంతోడైతే జగత్కళ్యాణం. విజ్ఞానం వివేకాన్నికోల్పోతే మారణహోమం. మానవుడు శాస్త్రవిజ్ఞాన పరిశోధనా ఫలితాలను అమలుపరచటంలో వివేకమును ప్రదర్శించాలి. విచక్షణను చూపించాలి.

**కొమరగిరి కృష్ణమోహనరావు**

పరిశోధనా ఫలితాలను చెడుకు, సంక్షోభానికి, సర్వ నాశనానికి కాక; మంచికి, మానవకళ్యాణమునకు, అధికోత్పత్తికి ఉపయోగపెట్టటమే 'వివేకజ్ఞానం'. వివేకవిచారణలచే విజ్ఞానమును సాధించాలి. అట్టి విజ్ఞానమును విచక్షణతో సమాజాభివృద్ధికి ఉపయోగించాలి.

వివేక విచక్షణాజ్ఞానం గలవాడు పేదవాడైనా, బీదవాడైనా, ధనహీనుడైనా, అధికారం లేనివాడైనా--- అతను అందరిచేత గౌరవించబడుతాడు. వివేకవిచక్షణా జ్ఞానములేనివాడు విద్యావేత్తయినా, ధనవంతుడైనా, ప్రముఖశాస్త్రవేత్త అయినాసరే, అతనికి ఏమాత్రం సమాజంలో గౌరవం ఉండదు.

వివేకవిచక్షణా జ్ఞానరహితుడు సామాన్య ధర్మమేదో, విశేష ధర్మమేదో గుర్తించలేడు, గమనించలేడు. యుద్ధభూమిలో శత్రువులను నిర్దాక్షిణ్యంగా సంహరించడం సైనిక ధర్మం. అదేవిధంగా దొంగలను హంతకులను, శిక్షించడం న్యాయస్థానముల ధర్మం. అయితే సమాజంలో సామాన్య పౌరుడు ఈపనులు చేయరాదు. ఇక్కడనే వివేకం ప్రదర్శించాలి.

ఏదైనా పని చేయవలసివచ్చినప్పుడు, సమాజ శ్రేయస్సును దృష్టియందుంచుకోవాలి. ఒకవేళ వ్యష్టి సమిష్టుల మధ్య వైరుధ్యం ఏర్పడుతే సమిష్టి శ్రేయస్సుకే

ప్రాధాన్యతయివ్వాలి. సామాన్య విశేషధర్మముల మధ్య సంఘర్షణ ఏర్పడితే, సామాన్యధర్మమును పరిత్యజించి విశేష ధర్మమును అనుసరించాలి. అదే వివేకవంతుని లక్షణం. అందువలన ప్రతిఒక్కరూ శాస్త్రజన్యజ్ఞానంతోనే సంతృప్తి చెందక వివేకవిచక్షణా జ్ఞానములను కూడా సంపాదించితీరాలి. వివేకంతో కూడిన దూరదృష్టిని అలవరచుకోవాలి.

మానవత్వాన్ని కోల్పోయిన విజ్ఞానం మారణ హోమానికి దారితీస్తుంది. విచక్షణారహితమైన నైపుణ్యం వినాశనానికి దోహదం చేస్తుంది. వివేకరహితమైన మేథాశక్తి సర్వనాశనానికి దారితీస్తుంది. కనుక వివేక విచక్షణాజ్ఞానాదులతో పాటు ప్రతిఒక్కరూ మానవత్వాన్ని కూడా పెంపొందించుకోవాలి.

*(ఆకాశవాణి సౌజన్యంతో ది. 15-7-1998)*

"ఉక్తం భాగవతం నిత్యం
కృతం చ హరిచింతనమ్
తులసీ పోషణం చైవ
ధేనూనాం సేవనం సమమ్."

భాగవత పఠనము, శ్రీహరి ధ్యానము, తులసీ పోషణము, గోసేవ - అను నాలుగు భారతీయులకు సమానములు.

తులసి కల్ప వృక్షమువంటిది. గోవు కామ ధేనువును బోలినది. గోపూజ, తద్దానము పితృ తారకములు. ఉషఃకాలమున గోదర్శనము శ్రేయో దాయకము. మానవులకు తల్లులు ముగ్గురు. ఒకరు కన్నతల్లి, మరొకరు గోమాత, ఇంకొకరు భూమాత.

రసవద్ఘట్టాలు - 41

## భగవాన్ జెండా

మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుడు ఛత్రపతి శివాజీ. దైవభక్తి, మాతృభక్తి, గురుభక్తి కల్గిన మహావీరుడాయన. 'జై రఘువీర సమర్థ' అంటూ భిక్షాటన చేస్తున్న, గురు సమర్థ రామదాసస్వామి వారిని శివాజి చూశాడు.

సమర్థుల రాకను గమనించిన గృహిణులు రామదాస స్వామికి పాదాభివందనాలు అర్పిస్తూ, ఆతని జోలెలో బియ్యం వేసేవారు.

శివాజి తన సేవకుని పిలిచి, కలం కాగితం తెమ్మన్నాడు. ఆకాగితంపై ఏమోరాసి, సమర్థరామదాసుల జోలెలో వేశాడు. రామదాసస్వామి ఆకాగితాన్ని తీసి చదువుకొన్నారు. ఎంతో కష్టపడి, యుద్ధాలు సలిపి జయించిన, తన సామ్రాజ్యాన్ని అంతటిని గురువుల వారికి అర్పించాడు. సమర్థులు చిరునవ్వుచిందిస్తూ "ఈ సామ్రాజ్యంవల్ల నాకేం లాభం?" అన్నారు.

"ఈ సామ్రాజ్యం అంతా తమదే. తమ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు" అన్నాడు శివాజి. "అలాగే ఈ సామ్రాజ్యమంతా నాదే, కాని ఈ సామ్రాజ్యపాలనా భారాన్ని నీకే అప్పగిస్తున్నాను. నాకోసం ఆపని చేయక తప్పదు" అన్నాడు.

'గురుదేవా, ఈసామ్రాజ్యం తమదే. తమ ప్రతినిధిగా ఏలుతున్నట్లు ప్రజలకు ఎలా తెల్పాలి" అని అడిగాడు.

సమర్థరామదాసస్వామి తమ కేసరి రంగు జోలెను అందజేస్తూ, దానితో పతాకాన్ని తయారుచేసుకోమన్నారు. నాటినుండి కాషాయ పతాకం ఛత్రపతి శివాజి సామ్రాజ్య సంకేతంగా మారింది. అలా అవతరించిందే, భగవాన్ జెండా.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ధర్మో రక్షతి రక్షితః

"లోకంలో ధర్మం నశించిపోతుంది" - ఈనాడు ఎవరినోట విన్నా ఇదేమాట! అయితే ఈవాదు వేసేవారు, తామూ లోకంలో ఒక భాగమేనన్న సత్యాన్ని విస్మరిస్తున్నారు! మానవుడు తప్ప తక్కిన జీవులన్నియు, తమకు తెలిసో, తెలియకో కొన్ని కట్టుబాట్లకు కట్టుబడి జీవిస్తున్నాయి. పశుపక్ష్యాదుల కన్న మిన్నయైన మానవుడు మాత్రం - వానికన్న హీనంగా జీవనము సాగిస్తూనే - లోకంలో ధర్మం నశించిపోతోందని గగ్గోలుపెడుతున్నాడు! అందుకు కారణం ఒక్కటే! ధర్మమార్గాన జీవనం సాగించే విధానం మానవుడు గ్రహించకపోవడమూ, ఆచరించక పోవడం! మానవుని సత్ప్రవర్తనా నియమావళి ఎలా ఉండాలో తెలియచెప్పడానికే, శ్రీమన్నారాయణుడు మానవ రూపంలో రామావతారం దాల్చాడు! సంక్షిప్త సమయాల్లో కూడ, రాజీలేని విధంగా ధర్మాన్ని ఎలా కాపాడుకోవాలో, ఆచరణలో ప్రజానీకానికి చూపెట్టినవాడు రాముడు. రావణుని బారినుండి, సీతాదేవిని క్షత్రియ ధర్మప్రకారం, రక్షించాడు. లోకుల మానసిక శంకలను మటుమాయం చేసేందుకు ప్రత్యక్ష సాక్ష్యాన్ని చూపెట్టాలి! అందుకోసమే సీతామహాసాధ్విని అగ్ని పరీక్షకు గురిచేశాడు! అంతేకాని ఆమె శీలాన్ని శంకించికాదు - పామరుని మాటలకు భయపడీకాదు! అదీ ధర్మ మార్గానుసరణమంటే! జీవితంలోని ఆటుపోట్లను, ఒడుదుడుకులను తట్టు కొంటూ, ధర్మమార్గాన జీవితం గడిపిన ప్రతి వ్యక్తికి, దైవ రక్షణ, దైవ కృప లభిస్తుంది. ఇదే రామచరితం మనకందించే సందేశం!

అలాగే మహాభారతంలో శ్రీకృష్ణ భగవానుడు ధర్మసూక్ష్మాలను బోధచేస్తాడు. జీవితము చరితార్థ మగుటకు, జన్మ ధన్యమగుటకు అవసరమైన నైతిక, తత్త్వ జ్ఞాన బోధనల సంగ్రహ చరిత్రే భారతం! ఆ మహాకావ్యంలో ముచ్చటైన మూడు ప్రధాన-భాగాలు ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకున్నాయి. అవి భగవద్గీత, యక్ష ప్రశ్నలు, విష్ణు సహస్రనామం!

తనసుతుడు ధర్మజుని, ధర్మనిబద్ధతను పరీక్షించాలనే సంకల్పం కల్గింది సమవర్తికి! అందుకే అరణ్యా వాసమందున్న పాండవులకు దాపుననే ఒక తటాకము చెంత ఒకరూపములో చేరుకుంటాడు. దప్పికతో బాధపడుచున్న సోదరులనుజూచి, ధర్మజుడు దాపున జలాశయమున్నదేమో వీక్షించి, జలమును గొనితెమ్మని నకులనకాదేశమిచ్చెను. దగ్గరలోనే జలాశయమును గాంచిన నకులుడు అన్నగారి ఆజ్ఞానుసారము, కాసారమును చేరి, జలమును త్రాగబోయెను. "ఓయీ!

## సోమంచి రామం

ఈ తటాకము నాది! నీవు నీరు త్రాగదలచిన నా ప్రశ్నలకు ముందుగా సమాధానము లొసంగవలెను అంటూ అ శరీరవాణి హెచ్చరించెను. ఆహెచ్చరికను సరకుజేయక నకులుడు, నీటదిగి, ఉదకము త్రాగి నిశ్చేతనుడయ్యెను. తదుపరి వచ్చిన సహదేవార్జున భీమాదులకు కూడ అదే దుర్గతి పట్టెను. చిట్టచివరకేతెంచిన ధర్మజుడు, తన నిజరూపమును తెలియచేయమని వినమ్రముగా అ శరీరవాణి నర్థించెను. అంతటా అదృశ్యవాణి, యక్ష రూపమున సాక్షాత్కరించి, సమస్యాత్మకమైన ప్రశ్నలను సంధించెను. ధరణికన్న తల్లి మహత్తరమైనదని, దాక్షిణ్యమే ధర్మానికాలవాలమని, అహింసయే అన్ని ధర్మాలకన్న పరమోత్తమైనదని, ధర్మరాజిచ్చిన సమయోచిత సమాధానాలలో కొన్ని మాత్రమే! ధర్మజుని ఉత్తరములతో సంతృప్తి చెందిన యక్షుడు, "మహాత్మా! నీవిచ్చిన సమాధానములతో నన్ను మెప్పించావు. కావున నీ సహోదరులలో ఒక్కని మాత్రమే బ్రతికించెదను. ఒక్కరిని కోరుకో!" అని పల్కెను. "యక్ష నాయకా! మా తండ్రిపత్నులిర్వురిలో - కుంతీసుతుడను నేను సజీవుడనైయున్నాను. ఇక రెండవపత్ని మాద్రి తనయులలో ఒక్కరైనను జీవించియుండుట

ధర్మసమ్మతము. కావున నకులుని పునరుజ్జీవింప చేయు' మని ప్రార్ధించెను.

"ధర్మతనయా! నేను యక్షరూపము దాల్చిన ధర్మ దేవతను! నీ ధర్మజ్ఞతను పరిశీలించవలెనన్న కుతూహలముతోనే ఈ ప్రదేశమును చేరితిని. నన్నా శ్రయించిన ఉత్తములకెన్నడూ దుర్గతి ప్రాప్తించదు. కనుక అభిమతమయిన వేరొక్కవరం ప్రసాదించెదను. వేడుకో కుమారా!" అంటూ ఆప్యాయంగా పల్కెను ఆ ధర్మ దేవత! తక్కిన సహోదరులను కూడ బ్రతికించెను.

ధర్మమునే నమ్ముకొని, ధర్మాన్ని కాపాడు కొంటూ, ధర్మమార్గాన్ని అనుసరించిన వారిని ధర్మమే కాపాడుతుంది! ఈ ధర్మాన్నెరిగి, ప్రతి మానవుడు తన ప్రవర్తన నియమావళిని సరిదిద్దుకొన్ననాడు లోకంలో ధర్మం నశించిపోతోందన్న అపవాదుకు ఆస్కారమే ఉండదు. అదే ధర్మో రక్షతి రక్షితః!

## సాయి - స్వర్ణరధం

సప్తాశ్వ రవితేజుడాదిత్యురాగా
పసిడికాంతులీను ప్రణవరధము

పరమాత్ము వెదకుచు
ప్రశాంతి పురమేతెంచె స్వామికి
స్వాగతంబు పలుక ఇహము
పరము ఇష్టకామ్యార్థ సిద్ధి
కాంచన రధము కాంచినవారికిన్.
పసిడి పలుకుల ప్రేమ పొంగు జాలువార

పీతాంబర సుశోభితుడై మెలమెల్లనవచ్చి
పర్తిసాయి పైడిరధముపై పాదము పెట్టి
పావన మొనర్చె ఆ ప్రత్యూషమున్.
శ్రీగణనాధ షణ్ముఖు లెదురుకోలుసేయ

సురలు విరుల వాన కురిపించ విరించి
వరించి రధసారధికాగా చెట్టియార్యుల
చిరకాల వాంఛనీడేర్చ కాంచనరధముపై
కదము పెట్టెసాయి.

- కామరాజ విజయలక్ష్మి

# ఆంధ్ర రాష్ట్ర పారిశ్రామిక ప్రగతికి అవిరళ కృషిచేసిన

# రామకృష్ణ

విజయవాడ నుంచి మచిలీపట్టణానికి బస్సులో ప్రయాణం చేస్తున్న వారికి ఉయ్యూరు మెయిన్‌రోడ్డు ప్రక్కవున్న కె.సి.పి.వారి బ్రహ్మాండమైన పంచదార ఫ్యాక్టరీ కన్నులకు విందు కలుగజేస్తుంది. సీజన్‌లో ఫ్యాక్టరీకి వెళ్ళే బళ్ళు, ట్రాక్టర్లతో ట్రాఫిక్‌జామ్ అవడం కూడా కద్దు. ఈ ఫ్యాక్టరీ వ్యవస్థాపకులు వెలగపూడి రామకృష్ణగారు.

ఆంధ్ర దేవంలో పరిశ్రమలను స్థాపించడానికి ప్రయత్నాలు 1920 దశకంలో మాత్రమే ప్రారంభ మయ్యాయి. 1926లో మచిలీపట్నంలో అయ్యగారి రామమూర్తి గారు స్థాపించిన ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ (ఇప్పటి బెల్) ఇందుకొక ఉదాహరణ. ఇటువంటి ప్రయత్నాలను మరికొందరు ప్రాతఃస్మరణీయులు మరికొందరు చేశారు. వారిలో అగ్రగణ్యులు కె.సి.పి. సంస్థ వ్యవస్థాపకులు వెలగపూడి రామకృష్ణగారు.

దేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వమే రామకృష్ణ గారు ప్రతిభగల ఐ.సి.ఎస్. ఆఫీసర్‌గా మద్రాస్ రాష్ట్రానికి ఎనలేని సేవలను అందించారు. ఆయన పుట్టింది బెల్లంపాటి అనే గ్రామం. భారతదేశానికి పునాదులు గ్రామాలు. నూటికి ఎనభయి మందికి వ్యవసాయం జీవనాధారం. దేశ ప్రగతికి పారిశ్రామికాభివృద్ధి తప్పని సరి. ఐతే ఇక్కడ వ్యవసాయం ప్రధాన వృత్తి కనుక వ్యవసాయ ప్రాతిపదిక పరిశ్రమలు అవసరం. ఇవి వ్యవసాయ కేంద్రాలయిన గ్రామాలలో ఏర్పడాలి. పరిశ్రమలు, వ్యవసాయం మేలుకలయితో దేశం అభివృద్ధి మరింత వేగంగా జరుగుతుంది. ఈ విషయాన్ని రామకృష్ణగారు 1930 దశకంలోనే గుర్తించారు. అప్పటికి ఆయన బాధ్యత గల ఉన్నత ప్రభుత్వోద్యోగి. అందువలన పరిశ్రమల స్థాపనాది విషయాలలో ప్రత్యక్షంగా పాల్గొనజాలరు. అందువలన ఆయన పరోక్ష ప్రోత్సాహ సహాయ సహకారాలతో 1941లో కె.సి.పి. సంస్థ ఏర్పడింది.

గ్రామ సీమలలో లభ్యమయ్యే చెఱకు వంటి ఉత్పత్తులతో పంచదార సిమెంటు పరిశ్రమలను స్థాపించాలని ఇందుకు అనుబంధంగా క్వారీలను, గనులను ఆధునికం చేయడం, రహదారులు, నీటి సప్లయి, ఇరిగేషన్ వంటి ప్రాతిపదిక సౌకర్యాలు అభివృద్ధి పరచడం, సిమెంటు, పంచదార ఫ్యాక్టరీలకు అవసరమైన యంత్రసామగ్రిని స్వయంగా ఉత్పత్తి చేసుకోవడం అవసరమైన భవనాల నిర్మాణం మొదలైన సమగ్రమూ నిర్దుష్టమైన లక్ష్యాలతో రామకృష్ణగారు కె.సి.పి. పరిశ్రమల సముదాయాన్ని స్థాపించారు.

## కంచి వాసుదేవరావు

1934 లో చల్లపల్లి రాజావారు తదితరులు భాగస్వామ్యంలో ఉయ్యూరులో పంచదార ఫ్యాక్టరీ ఏర్పడింది. కాని అది కొద్ది సంవత్సరాలకే తీవ్రమైన ఆర్థిక చిక్కులలో పడింది. అట్టి పరిస్థితులలో రామకృష్ణగారు తమ సంస్థ తరుపున కె.సి.పి.ని స్వాధీన పరచుకున్నారు. ఆనాటి నుంచి ఉయ్యూరు చక్కెర ఫ్యాక్టరీకి ముందడుగే కాని వెనుక అడుగు లేదు. ఈనాడు దేశంలోని ప్రధానమైన పంచదార ఫ్యాక్టరీలలో ఇది ఒకటి.

నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన రోజులవి. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి కొన్ని లక్షల సిమెంటు బస్తాలు అవసరం. దీన్ని దూరంగా సిమెంటు ఫ్యాక్టరీల నుంచి తెప్పించుకోవాలంటే కొన్ని కోట్ల రూపాయలు రవాణా ఖర్చు అవుతుంది. అందువలన ప్రాజెక్టు సమీపంలో ఒక సిమెంటు ఫ్యాక్టరీని నెలకొల్పడం ప్రయోజనకరమని భావించి మాచెర్లలో రామకృష్ణ కె.సి.పి. తరపున ఒక సిమెంటు ఫ్యాక్టరీని స్థాపించారు. ఇక్కడ సంవత్సరానికి నాలుగు లక్షల టన్నులకు మించి సిమెంటు ఉత్పత్తి జరుగుతోంది.

1952లోనే రామకృష్ణ మద్రాస్‌లో హెవీ ఇంజనీరింగ్ పరిశ్రమను స్థాపించారు. ఇక్కడ వివిధ పరిశ్రమలకు చెందిన భారీ యంత్రాలు తయారవు

తున్నాయి. ఇది అనేక హెవీ ఇంజనీరింగ్ పరిశ్రమల స్థాపనకు స్ఫూర్తి నిచ్చింది.

రామకృష్ణగారు ఇచ్చిన స్ఫూర్తితో వారి కుమారుడు వి.ఎల్. దత్తు తండ్రి చూపిన మార్గంలో (1968లో రామకృష్ణ దివంగతులయ్యారు) కె.సి.పి. సంస్థలను మరింత ముందుకు తీసుకు వెళుతున్నారు. కె.సి.పి. ఆధ్వర్యంలో చల్లపల్లి షుగర్ ఫ్యాక్టరీతో పాటు 35 పంచదార ఫ్యాక్టరీలు, 12 సిమెంటు ఫ్యాక్టరీలు నిర్వహించబడుతున్నాయంటే రామకృష్ణ పారిశ్రామిక రంగంలో వేసిన పునాదులు ఎంత బలమైనవో అర్థం అవుతుంది.

ఒక స్పష్టమైన లక్ష్యం. ఆ లక్ష్యాన్ని సాధించాలన్న దృఢ సంకల్పం, దాన్ని సాధించేందుకు ఒక కార్యాచరణ పథకం, దాన్ని సమర్ధవంతంగా అమలు పరచగల యంత్రాంగం - అన్నిటి కన్న మించి నిజాయితీ వున్ననాడు ఎంతటి క్లిష్ట కార్యమునయినా సాధించడం అసాధ్యం కాదని రామకృష్ణ నిరూపించారు.

రెండవ ప్రపంచ సంగ్రామం కాలంలో పెట్రోలుకు కరువు ఏర్పడింది. ఆ రోజులలో మండుతున్న బొగ్గుల నుంచి తయారయిన గ్యాస్‌తో బస్సులు నడిచేవి. భారత్‌లో గ్యాస్‌ను ఆయన తయారు చేయించారు.

ఏ పరిశ్రమ అయినా అభివృద్ధి చెందాలంటే యాజమాన్యం కార్మికుల మధ్య సత్సంబంధాలు వుండేవి. తమ సంస్థలో పనిచేసే కార్మికులకు తగిన జీతాలు చెల్లించడంతోపాటు వారి శ్రేయస్సు సంక్షేమం పట్ల యాజమాన్యానికి ఆసక్తి వుండాలి. అదే విధంగా తమకు జీవనోపాధినిస్తున్న సంస్థ శ్రేయస్సు పట్ల కార్మికులకు ఆసక్తి వుండాలి. రామకృష్ణ గారు యాజమాన్యం కార్మికుల మధ్య ఇట్టి సత్సంబంధాలనే నెలకొల్పారు. కె.సి.పి. యాజమాన్యంలో వున్న సంస్థలలో సమ్మెలు, కార్మికుల అలజడులు వుండవనడం అతిశయోక్తి కాదు.

## మాచ్ ఖండ్ ఆయన చలువే!

నాగార్జున సాగర్ ప్రాజెక్టు డా॥ కె.ఎల్. రావుగారి కృషి వలన వచ్చిందన్న సంగతి తెలిసిందే. ఈ విధంగా ఒరిస్సా, ఆంధ్ర సరిహద్దులలో వున్న మాచ్‌ఖండ్ రిజర్వాయర్ రామకృష్ణ గారి కృషి వల్లనే అవతరించింది.

# శ్రీరామచంద్ర

1. వేరువేరను భావమ్ము వెడలగొట్టి
యందరొక్కటెయను చిన్న యంకురమును
నాటి నాలోన పెంచవా నాశహరణ ?
రమ్య రాజీవ నగర శ్రీ రామచంద్ర

2. మంచి చెడులను తెలియుచు మసలజేసి
పరమపధ గాములగుటకు బాటవేయు
రామ! గుణధామ! వరద! నీ నామ మొకటె
రమ్య రాజీవ నగర శ్రీరామచంద్ర

3. అసురగణముల బాధలునధికమయ్యె
అమరులందరు చేసెడి నారి వినియు
అవతరించితె రిపుల సంహారమునకు
రమ్య రాజీవనగర శ్రీరామచంద్ర

4. పెద్ద యుద్యోగికిని చేత పెట్టకున్న
పనులు కానివ్వడు గద ఓయి! పరమపురుష
కాలమహిమయా యతనిదికాద! తప్పు
రమ్య రాజీవ నగర శ్రీ రామచంద్ర

5. తనదు పేరను లిఖియించి దాతగాను
గోపురమ్ముల కుడ్యాల గుళ్ళనుంచ
ఫలమ పేక్షించి కాదొకో పరమపురుష
రమ్య రాజీవ నగర శ్రీరామచంద్ర

**- రాయప్రోలు వామనమూర్తి**

రామకృష్ణగారు ఒరిస్సాలోని జయపురం సంస్థానం దివాన్‌గా పనిచేసి ఆ సంస్థాన అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. ఆనాటి సంస్థానాధీశుడు విక్రమ దేవవర్మ ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఏటా లక్షల రూపాయలు విరాళంగా యివ్వాలన్న నిర్ణయానికి వెనుక రామకృష్ణగారి ప్రోత్సాహం వున్న సంగతి చాలామందికి తెలియదు.

## విద్యా పోషకులు

విద్యా రంగానికి ఆయన నిరుపమాన సేవలు చేశారు. గ్రామాలు విద్యావంతమైనప్పుడే దేశం ముందుకు

సాగుతుందని రామకృష్ణ విశ్వసించారు. తన స్వగ్రామానికి సమీపంలో వున్న నగరంలో 70 ఎకరాల సువిశాలమైన ఆవరణలో డిగ్రీ కాలేజీని స్థాపించారు. తెనాలిలో ఎన్.వి.ఆర్. కాలేజీకి భూరి విరాళం యిచ్చారు.

రామకృష్ణగారు నడచిన మార్గాన్నే కె.సి.పి. పయనిస్తూ ఉయ్యూరులో ఫస్ట్ గ్రేడ్ కాలేజ్జిని నెలకొల్పారు. తమ ఫ్యాక్టరీలో పనిచేసే సిబ్బంది పిల్లలకు గాను రామకృష్ణగారు స్మారక ఉన్నత పాఠశాలను నెలకొల్పారు. ఇందుకు యాజమాన్యం 75 లక్షల రూపాయలు ఖర్చు పెట్టిందంటే అది గొప్ప విషయమే. ఆధునికమైన లేబోరేటరీ, గ్రంధాలయం, ఆడిటోరియం మొదలైన అన్ని హంగులు ఈ హైస్కూలుకు అమరాయి. విజయవాడలో సిద్ధార్థ ఇంజనీరింగ్ కళాశాలకు 12 ఎకరాల స్థలాన్ని, పది లక్షల భూరి విరాళాన్ని ఈ సంస్థ అందజేసింది. ఇందుకు స్ఫూర్తి నిచ్చింది రామకృష్ణగారే.

ఒకప్పుడు ఒక మోస్తరు గ్రామమయిన ఉయ్యూరు కె.సి.పి. షుగర్ ఫ్యాక్టరీ కారణంగా కృష్ణాజిల్లా లోనే కాక ఆంధ్రదేశంలోనే ముఖ్యమైన పట్టణాల స్థాయికి ఎదిగింది. ఉయ్యూరు ప్రజలు ఇందుకు రామకృష్ణగారికి కలకాలం కృతజ్ఞులై ఉండాలి.

భారతం అరణ్యపర్వంలో ఒక చిన్న కథ ఉంది. అది మనకు తెలియజేసేదేమంటే భూలోకంలో ఒకరు చేసిన పుణ్య కార్యాలను ఆ తర్వాతి తరాల ప్రజలు ఎంతవరకు గుర్తుంచుకుంటారో. అంతవరకు అతను స్వర్గలోకంలో ఉంటాడని. దీన్ని ఇప్పటి పరిస్థితులకు అన్వయించుకుని చెప్పాలంటే ఒక వ్యక్తి చేసిన సత్కార్యాలు లేదా విశిష్ట సేవలు ఎంతవరకు గుర్తుంటాయో అంతవరకు ఆ వ్యక్తి చిరంజీవే. యశఃకాయుడే - రామకృష్ణగారు ఇంకా అనేక తరాల వరకు యశః కాయులై చిరంజీవిగా నిల్చిపోతారు. 

## సాయి వాక్కు - సత్య వాక్కు

భగవంతుని సృష్టిలో జన్మలు అనేకములు. అందు మానవజన్మ ఎత్తుట దుర్లభము. పూర్వజన్మ సుకృత తపః ఫలము ఉంటేగాని మానవజన్మ లభించదు. దుష్టశిక్షణ శిష్టరక్షణకై భగవంతుడు అనేక అవతారములు ధరించుట లోకవిదితము. ఈ కలిలో ధర్మోద్ధరణకై అవతరించిన మహనీయులలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు ఒకరు. వీరు సర్వదేవతాతీత స్వరూపులు. మా పూర్వజన్మ తపఃఫలము వలన వీరిని దర్శించు భాగ్యము నా చిన్ననాటినే లభించినది. నాకు ముగ్గురు కుమారులు. అందు పెద్దవాడు వాని పూర్వకర్మచే పుట్టుకతోనే అనారోగ్యవంతుడు అయినను బాబావారి అనుగ్రహముచే పదకొండు సంవత్సరముల వరకు బాగానే ఉన్నాడు. నాటి నుండి ఫిట్స్ వ్యాధి వచ్చి అనేక ఇబ్బందులకు గురి అయ్యాము. తెలిసి తెలియక ఎన్నో వైద్యాలు చేయించాము. మధ్యలో స్వామిని దర్శించుట జరిగినది. ఆనాడు బ్రతుకుతాడు అనే ఆశ ఎవ్వరికీలేదు. రెండు నిమిషముల వ్యవధిలో స్వామి రెండుస్లారు విభూతి సృష్టించి వానిని జీవింపజేశారు. ఆ తదుపరి మరికొంత కాలమునకు వారిని దర్శింపవెళ్ళగా "ఇల్లొకచోట - ఫౌండేషన్ ఒకచోట కుదురుతుందా? నీవు చేయించిన వైద్యాలే వీనిని ఇట్లా చేశాయి" అని సెలవిచ్చారు. వీడు అభివృద్ధిలోకి వస్తాడు. ప్రయోజకుడు అవుతాడు. నీకెందుకు బెంగ. నేనున్నానుగా అని సెలవిచ్చారు. యదార్థం ఆలోచిస్తే పిల్లవాని పరిస్థితిని బట్టి చూస్తే వారి మాటలు నాకు అగమ్యగోచరంగా అనిపించాయి. కారణం వాడు విద్యాహీనుడు. జబ్బు ప్రభావం వలన మేము ఎవరమో తెలియని స్థితిలో ఉన్నాడు. స్వామి ఇలా సెలవిచ్చారేమిటా అని అనుకొని, ఏదో కష్టపడి వెళ్ళినందులకు నా తృప్తికోసం అలా అన్నారని అనుకున్నాను. కాని వారి విభూతిసేవనము వలన క్రమేపి పిల్లవానికి ఫిట్స్ తగ్గిపోవటమేకాక, కలలో కూడా ఊహించని రీతిలో ఒక ప్రభుత్వ కార్యాలయములో ఉద్యోగస్తుడైనాడు. అంతేకాదు వివాహము అయి ఇరువురు సంతానము కూడా కలిగిరి.

సాయివాక్కు సత్యవాక్కు అనునది తథ్యము.

గీ॥ కరుణతో శ్రీసాయి కరముద్రిప్పి । సృష్టియొనరించి విభూతి నొసగితేని ॥
మాయమగు రోగాలు మనలవీడి । సాయిబాబను సేవించి సౌఖ్యపడుడు. ॥

- వి. రామం

భగవాన్ సాయి మహిమలు

# జువాన్ మూర్

డి. వెంకటేశ్వరరావు

జువాన్ మూర్ అమెరికాలోని సెంట్ లూయిస్ నగరవాసి. నీగ్రోజాతికి చెందినవాడు. అతను స్కూల్ విద్యార్థిగా ఉన్నప్పుడు ప్రతివారం చర్చికి వెళ్ళి భక్తిపాటలు చాలా చక్కగా పాడేవాడు. ఏసుక్రీస్తు మీద ప్రేమ పెంచుకున్నాడు. ఏసుక్రీస్తు గురించి ప్రేమపూర్వక ఆలోచనలు, మధురమైన భక్తిసంగీతం - ఈ రెండు కలసి అతన్ని ఎప్పుడూ భక్తి ప్రపంచంలోనే గడిపేటట్లు చేసాయి. కాని అతనికి హఠాత్తుగా నిరాశ ఎదురైంది. చర్చికొచ్చే భక్తుల బలహీనతలు, తాగుడు, స్త్రీలోలత్వం, మోసం మరి అనేక వ్యసనాలకు అలవాటు పడటం కళ్ళారా చూశాక చర్చికి వెళ్ళటం మానేశాడు. అతడి భక్తి జీవితం అంతటితో అంతరించింది.

తర్వాత ఒక శ్వేత జాతివారికి చెందిన పెద్ద హోటలులో చిన్న ఉద్యోగంలో చేరి కేవలం తన శక్తిసామర్థ్యాల వల్ల కొద్ది రోజులలో అసిస్టెంట్ మేనేజరు అంతస్తుకి పెరిగాడు. అప్పుడే వర్జీనియా అనే శ్వేత జాతి అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. కొంత కాలానికి ఆ హోటల్‌లో జనరల్ మేనేజర్ ఉద్యోగం ఖాళీ అయింది. తన కృషితో అనేక లాభాలు ఆర్జించి పెట్టినందువల్ల ఆ ఉద్యోగం తనకే వస్తుందనుకున్నాడు జువాన్ మూర్. కానీ, ఆ ఉద్యోగానికి ఒక శ్వేతజాతి మనిషిని నియమించటంతో నిరాశచెంది ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు.

మంచితనానికి ఈ ప్రపంచంలో చోటులేదని నిర్ణయానికొచ్చాడు మూర్. అప్పుడోనూతన తరహా వ్యాపారం మొదలుపెట్టాడు. దొంగతనాలు చేసేవాళ్ళకు సలహాలివ్వడం, వాళ్ళ అవసరాలకి పెట్టుబడిపెట్టి, వాళ్ళు దొంగతనం చేసిన సొమ్ములో కొంతభాగం తీసుకోవటమే ఈ కొత్త వ్యాపారం. దొంగతనం చేసేవాళ్ళ సాంగత్యం ఏర్పడటం వల్ల తాగుడు, మాదక ద్రవ్యాలు సేవించటం, స్త్రీలోలత్వం మొదలైన దురలవాట్లన్నీ జువాన్ మూర్‌కి అబ్బినాయి.

అతని భార్య వర్జీనియా అతని నైతిక పతనాన్ని చూస్తూ ఎంతో బాధపడింది. వాళ్ళ ఇల్లు దొంగలకి, తాగుబోతులకి, మాదక ద్రవ్యాలు సేవించేవారికి నిలయంగా మారటం వల్ల, కొంత కాలం కాలిఫోర్నియాలో ఉన్న తన అన్నగారింటికి వెళ్ళింది. ఆవిడ చిన్నప్పుడే అనేక మత గ్రంథాలు, తత్త్వశాస్త్ర గ్రంథాలు చదివి, ధర్మాన్ని రక్షించటానికి భగవంతుడు ఈ భూమిమీద ఈ కాలంలో అవతరించి ఉండాలని గట్టి నమ్మకంతో ఉంది. వర్జీనియా కాలిఫోర్నియాలోని ఉండగా ఒక రోజున ఆమె స్నేహితురాలొకామె కాలిఫోర్నియాలో సత్యసాయి భజన కేంద్రానికి తీసుకువెళ్ళింది. భజనలు విని, స్వామి మీద తీసిన ఒక సినిమా చూసి, వర్జీనియా కొన్ని పుస్తకాలు, విభూతి పాకెట్లు కొన్నది. ఆ పుస్తకాలు చదువుతుంటే ఆమెకు, ధర్మాన్ని రక్షించటానికి దేవుడు ప్రస్తుతం ధరించిన రూపం సత్యసాయి బాబాయేనన్న నమ్మకం నిదానంగా పెరగసాగింది. కొద్ది రోజులలో భర్త ఇంటికి తిరిగివెళ్ళింది.

వర్జీనియా లేని సమయంలో జువాన్ మూర్ స్నేహితులు 24 గంటలు అతని ఇంట్లోనే గడిపేవాళ్ళు. మూర్ స్నేహితులు చిల్లర దొంగతనాలతో విసుగెత్తి ఒక్కసారే కొన్ని లక్షల డాలర్లు సంపాదించే పథకాన్ని మూర్‌ని రూపొందించమన్నారు. అంత డబ్బు ఒక్కసారే సంపాదించాలంటే ఏదైనా బ్యాంకుని కొల్లగొట్టటం తప్ప వేరే మార్గంలేదువాళ్ళకి. బ్యాంకు బిల్డింగ్ ప్లాను, బ్యాంకులో డబ్బు నిలువజేసే చోటు, బ్యాంకులో ఎంతమంది పనిచేస్తున్నారు, వాళ్ళు ఎదురు తిరిగితే తీసుకోవలసిన చర్యలు, ఎన్ని కార్లు కావాలి. ఇటువంటి వివరాలతో బ్యాంకు దోపిడీకి రోజుల తరబడి తాగుతూ, మాదక ద్రవ్యాలు సేవిస్తూ చర్చించుకుంటున్నారు.

ఈ బ్యాంకు దోపిడీకి నిజంగా పాల్పడితే యావజ్జీవ శిక్షగాని, ఉరిశిక్షగాని పడటం ఖాయం. వర్జీనియాకి తన భర్తను ఎలా మార్చాలో అర్థం కాలేదు. స్వామి సూక్తులను కాగితాల మీద టైపుచేసి, ఆ కాగితాలను ఇంట్లో చాలాచోట్ల ఉంచింది.

బ్యాంకు దోపిడీకి నిర్ణయించుకున్న రోజురానే వచ్చింది. దోపిడీ చేయవలసిన మూర్ స్నేహితులంతా మొహం చాటేశారు. ఒక్కరు కూడా రాలేదు. దాంతో ఎక్కువగా నిరాశ చెందిన మూర్ బాగా తాగేశాడు. తాగిన మైకంలో ఒళ్ళుతూలి క్రిందపడ్డాడు. లేవటానికి ప్రయత్నించాడుగాని లేవలేక దగ్గరున్న బల్లమీద తలపెట్టి కూర్చున్నాడు. ఆ బల్లమీద ఒక కాగితం కనిపించింది. దానిమీద మొదటలైను ఇలా ఉంది. ''నన్ను నమ్మినవాళ్ళకు నేనే భగవంతుడిని. నా భక్తులను సర్వదా రక్షించటమే నా కర్తవ్యం''. ఇది చదివి ఉలిక్కిపడి లేచాడు మూర్. ఆ కాగితంలోని మిగతా సూక్తినంతా చదివాడు. భార్య వర్జీనియాని పిలిచి, "నేనే దేవుడినంటున్న ఈ సాయిబాబా ఏ శతాబ్దంలో మరణించాడు?'' అని అడిగాడు. సాయిబాబా ఇప్పుడు భూమి మీద సజీవంగా ఉన్నారని, ఆయనను భగవంతుని అవతారంగా నమ్మే భక్తులు ప్రపంచమంతటా ఉన్నారని, తాము నివసించే సెంట్‌లూయిన్ నగరంలో కూడా ఉన్నారని చెప్పింది వర్జీనియా. స్వామిని గురించి రాసిన పుస్తకాలు కొన్ని ఇచ్చింది. మూర్ రెండు రోజులు పుస్తకాలు చదివాడు. మూడవ రోజున స్వామి కలలో కనిపించి అతన్ని తన దగ్గరకు రమ్మని చేత్తో పిలిచారు.

స్వామి కలలో కనిపించిన రోజు నుండి మూర్‌లో పెద్ద మార్పు వచ్చింది. సిగరెట్లు, తాగుడు, మాదక ద్రవ్యాలు, మాంసభక్షణంతో బాటు అన్ని ఇతర వ్యసనాలు ఆ రోజే మానివేశాడు. ఆ నగరంలో ఉండే భక్తుల ద్వారా ఒక బృందం అమెరికా నుండి రెండువారాల్లో స్వామి దగ్గరకు వెళ్తుందని తెలుసుకొని తానుకూడా టికెట్ రిజర్వు చేసుకున్నాడు.

1974వ సంవత్సరంలో శివరాత్రి ఇంకా మూడు రోజులుందనగా ఆ బృందం పుట్టపర్తి చేరుకుంది. 30,000 మంది భక్తులున్నా, మొదటి రోజునే మందిరంలో భజన సమయంలో ముందర కూర్చోవటానికి అవకాశం వచ్చింది మూర్‌కి. స్వామి తనకు కొద్ది దూరంలోనే కూర్చున్నారు. భజనలు జరుగుతున్నాయి. అయినా మూర్ మనకు ఎక్కడికో వెళ్ళిపోయింది. లాస్ వేగాస్ నగరానికి వెళ్ళి జూదమాడితే చాలా డబ్బు సంపాదించవచ్చునని ఆలోచిస్తూ స్వామి వంక చూసాడు. స్వామి తన వంకే చూస్తూ అటువంటి ఆలోచనలు రాకూడదన్నట్లుగా చేయి అడ్డంగా ఒక ప్రక్క నుండి మరో ప్రక్కకు ఊపుతున్నారు. మరికొంచెం సేపటి తర్వాత మూర్ భజనలు పాడే ఆడవారి వంక చూడటం మొదలుపెట్టాడు. మళ్ళా స్వామి మూర్ వంకే చూస్తూ చేతిని అడ్డంగా ఊపారు.

ఆ తర్వాతరోజు స్వామి మూర్‌ని ఇంటర్వ్యూకి పిలిచారు. ఇంటర్వ్యూ గదిలో ఒక మూలనిలబెట్టి "నీకు ఆడవాళ్ళంటే చాలా ఇష్టం కదూ" అని అడిగారు. మూర్ ఏదో క్షమాపణ చెప్పబోతుంటే మాట్లాడవద్దని సంజ్ఞ చేశారు. మూర్‌ని చొక్కా విప్పేయమన్నారు. అతని కర్మను తుడిచేసి అతనిలో ఉండే దోషాలను తీసివేయటానికి అన్నట్లు స్వామి గుప్పెళ్ళతో విభూతిని సృష్టించి మూర్ గొంతునుండి నడుముదాకా చాలాసేపు రాసారు. రెండు రోజుల తర్వాత శివరాత్రి రోజున షిర్డిసాయి బాబా విగ్రహానికి విభూతి అభిషేకం చేయకముందే, జువాన్‌మూర్‌కి విభూతి స్నానం చేయించారుస్వామి.

స్వామి దర్శనం తర్వాత అమెరికాకు తిరిగి వచ్చిన మూర్ ధ్యానంలో తన శరీరాన్ని మర్చిపోగలిగేవాడు. వారానికి కొన్ని రోజులు ఉపవాసం చేయటం మొదలు పెట్టాడు. పూర్తిగా బ్రహ్మచర్యాన్ని అవలంబించాడు.

ఆ రోజు బ్యాంకు దోపిడీ జరిగిఉంటే, అమెరికాలో అతిపెద్ద నేరస్తుడి జాబితాలో చేరి మరణశిక్ష అనుభవించాల్సిన జువాన్‌మూర్‌ని, స్వామి కొద్దిరోజులలో ఇంచుమించు ఒక యోగిగా మార్చివేశారు.

నీతియే నీ జాతి; అది వదలినచో నీవు కోతి కంటే హీనుడవవుతావు. దృష్టి యెట్టిదో సృష్టి అట్టిది, పొంగి క్రుంగని తత్వాన్ని అభివృద్ధి పరచుకుంటే, లొంగి వంగని జీవితం గడుపవచ్చు.

- శ్రీ సత్యసాయిబాబా

# అన్ని చింతల కంటె భగవత్ చింతన మేలు

ప్రేమస్వరూపులారా!

ఈ జగత్తునందు శాంతి సుఖము అనునది ఎక్కడా కానరాదు. మానవుడు శాంతి స్వరూపుడై ఉండి కూడా తన శాంతిని తాను తెలుసుకోలేకపోతున్నాడు. తానే ప్రేమస్వరూపుడై ఉండి కూడను తన ప్రేమను తాను అనుభవించలేకపోతున్నాడు. ఇత్యాది పవిత్రమైన గుణములు మానవునియందు ఉండికూడనూ తన సత్యమును తాను గుర్తించుకొనలేక, అసత్యములో మునిగి అనంతమైన బాధలను అనుభవిస్తున్నాడు. కనుక మానవుడు దైవత్వాన్ని వెతుకవలెననిన లేక శాంతి సుఖములు అనుభవించవలెననిన ఎక్కడికో పోయి వెదకనక్కరలేదు. తన తప్పులు తాను గుర్తించినప్పుడే స్వస్వరూప సందర్శన భాగ్యము లభ్యమవుతుంది.

సూర్యుని నుండి ఆవిర్భవించినటువంటి తేజస్సు, ఈ మేఘ సముదాయములు సూర్యునినే కప్పి వేసి సూర్యునినే కనిపించకుండా చేస్తున్నాయి. ఝుం ఝుం మారుతం వీచినప్పుడు ఈ మేఘములు దూరమై స్వస్వరూపుడైన సూర్యుడు గోచరిస్తాడు. ఈనాటి మానవునికి సత్యమును గుర్తించడానికి అడ్డు తగిలినది ఏమిటి? అన్నింటికి అడ్డు తగిలేది మనసే. ఈ మనసు ఆత్మనుండియే ఆవిర్భవించినటువంటిది. సూర్యుని వలన లభ్యమైనటువంటి మేఘములు సూర్యుని ఏవిధముగా కప్పివేస్తున్నాయో, అదే విధముగనే మానవుని నుండి ఆవిర్భవించినటువంటి మనసు మాధవత్వానికి, ఆత్మకి అడ్డు తగులుతున్నది. కనుక దేనినుండి ఆవిర్భవించి నటువంటిదోననే సత్యమును గుర్తించడానికి తగిన కృషి చేయాలి. ఈనాటి ప్రపంచమునందు మానవుడు అనేక అవస్థలకు గురియై, అజ్ఞానములో చిక్కుబడి, శాంతి సంతోషములకు దూరమవుతున్నాడు.

మానవత్వంలో వుండినటువంటి దివ్యమైన శక్తి మరియొక ప్రాణి యందు ఎక్కడా కానరాదు. సమస్తమైన శక్తులు మానవునియందు ఉంటున్నాయి. కాని ఇట్టి దివ్య శక్తిని తాను తెలుసుకోలేకపోతున్నాడు. దీనిని ఎప్పుడు తెలుసుకోవటానికి వీలవుతుంది? దైవము యొక్క స్నేహమును మనం పొందినప్పుడే సర్వశక్తులూ మనలో ఆవిర్భవిస్తుంటాయి. 'సుహృత్' అనగా స్వార్థం ఎరుగనటు వంటివాడు. ప్రతిఫలమును ఆశించనటువంటివాడు, ఎట్టి కీడును తలబెట్టనటువంటివాడు, ప్రేమస్వరూపుడైనటు వంటివాడు. అటువంటివాడు స్నేహితుడు ఒక్కడే. అతనే భగవంతుడు. ఏ మానవుడైనా ప్రతి ఫలమును ఆశించే తాను ఉపకారం చేస్తుంటాడు. ఎట్టి ప్రతిఫలమును ఆశించక, ఎదురు చూడక, ఎదుటి వాడి క్షేమమే తన

## భగవాన్ సాయి దివ్యబోధ

ఆనందముగా భావించి, స్నేహంతో సంచరించేటటు వంటివాడు ఒక్క భగవంతుడు మాత్రమే. మానవుని యందు క్రోధలోభ మోహములు ప్రవేశించి మానవత్వానికి అశాంతిని, అసుఖమును చేకూరుస్తూ, ఆనందానికి దూరం చేస్తున్నాయి. అన్నింటి కంటే మానవునికి శత్రువు 'కోరిక.' ప్రాపంచిక సంబంధమైన కోరికలయందు, నేడు ద్వేషిగా వుండేవాడు రేపు స్నేహితునిగా మారవచ్చు. నేడు శత్రువుగా ఉండేటటు వంటివాడు రేపు మిత్రునిగా మారవచ్చును. కాని 'గీత' ఆవిధంగా అంగీకరించటం లేదు. కోరిక అనేది ఎప్పుడూ శత్రువుగానే ఉంటుంది. ఈ కోరికలు కేవలం మానవునే కాదు దేవతలను కూడా ఒక క్షణంలో మార్చివేయగలవు. ఈ కోరికలకు తృప్తి అనేదే లేదు. కనుకనే ఈ కోరికలను అగ్నితో, సముద్రంతో పోల్చింది వేదాంతం. ఈ అగ్నిలో ఎన్ని కట్టెలు వేసినా చాలు...చాలు... అనదు. ఎన్నికట్టెలు వేసినా ఇంకా కావాలి.... ఇంకా కావాలి..... అంటుంది. ఇకపోతే సముద్రము కూడా అంతే దానిలో ఎన్ని నదులు వచ్చి కలిసినా చాలు...చాలు.... అనదు. ఎన్ని నదులు ప్రవేశించినా సముద్రం యధాతథంగానే ఉంటుంది.

సముద్రమునకుగాని, అగ్నికి గాని తృప్తి అనేది ఎక్కడా కానరాదు. మానవుని కోరికలు కూడా ఇటువంటివే. ఈనాడు మనం ఏకత్వమును కోల్పోయినాం. ఎవరి యందు కూడా ఐక్యత అనేది కానరావటం లేదు. ప్రతి వ్యక్తి యందునూ ఏదో ద్వేషం....ద్వేషం.... ఈ ద్వేషమే మానవుని అన్ని విధములా హతమార్చి వేస్తున్నది. కనుక ఈ ద్వేషమును దూరం గావించుకోవటానికి దైవ స్నేహమును పెంచుకోవాలి. మీ నివాసం ఎక్కడ? అంటే ఇంటి పేరో, హోటల్ పేరో, వీధి పేరో ఏదో ఒకటి చెబుతాం. కాదు....కాదు.... మన నివాసం ఇది కాదు 'హృదయం' మన నివాసం. ఇట్టి హృదయమునందు ఉండినటువంటి పవిత్రుడైన స్నేహితుడ్ని మనం మరచిపోతున్నాం. ప్రపంచమంతయూ ఒక గ్రంథమే. దీనిని చక్కగా చదువు. ఇదియే నీయొక్క గురువు. Nature is the Best Teacher. ఈ జగత్తు నందు తెలుసుకోవలసినవి అనేకం ఉన్నవి. ఒక గ్రంథమునందుగాని, సాధనలో గాని భగవంతుడు మనకు కానరాడు. నిరంతరం మనం గ్రంథములను చదువుతునే ఉంటాం. కాని ఈ గ్రంథములు చదవటం వలన మనకు కలిగేది అనుమానాలే తప్ప, సరియైన దివ్యత్వం మనకు కానరాదు. మానవునికి ఎంత మేథా శక్తి వున్నదో, అంత సందేహశక్తి కూడా ఆవరించి ఉంటున్నది. కనుక ప్రపంచమే మనకు గ్రంథం. దైవమే మన మిత్రుడు. ప్రేమయే మన గృహము. దయయే మన సాధన. కనుక మనం దయతో సాధనలు చేసినప్పుడే దివ్యమైనటువంటి, ప్రేమస్వరూపుడైన భగవంతుడు మనకు గోచరిస్తాడు. గ్రంథములయందు దైవం కానరాడు. గ్రంథములు చదివి చదివి తానొక గ్రంధముగా మారి పోతున్నావు. కనుక నీవు పుస్తకంగా తయారు కావద్దు. ఈ పుస్తకమునందు వుండినటువంటిది మస్తకము నుండి ఏర్పడినటువంటిదే.

ప్రాచీన కాలమునుండి మన భారతదేశం అనేక విధముల ఆస్తిక మార్గములనందు ప్రబోధలు చేసి, అన్ని దేశములకు శాంతి భద్రతలను అందజేస్తూ వచ్చింది. **"లోకా స్సమస్తా సుఖినోభవంతు"** అందరూ సుఖంగా ఉండాలని, లోకమంతా సుఖసంతోషాలతో విలసిల్లాలని భారతీయుల భావన. కనుక ప్రతి ఒక్కరూ దేశం యొక్క శాంతిని కాంక్షించాలి, దేశము యొక్క సౌభాగ్యమును ఆశించాలి. ఏపని చేస్తున్నా దేశం యొక్క క్షేమమును దృష్టియందుంచుకోవాలి.

విశ్వశాంతి మనకు ఏవిధంగా లభిస్తుంది? ఈ విశ్వశాంతికి మూలం సమాజం యొక్క శాంతి. ఈ సమాజం యొక్క శాంతి ఎక్కడ నుండి ఆవిర్భవిస్తున్నది? వ్యక్తి యొక్క శాంతి నుండియే సమాజ శాంతి ప్రారంభ మవుతున్నది. కనుక వ్యక్తి, సమాజం, విశ్వం - ఈ మూడూ త్రిమూర్త్యాత్మిక స్వరూపాలు. అంతేగాక ఇవి అన్యోన్యాశ్రయములు. ఇటువంటి అన్యోన్యాశ్రయంతో కూడినటు వంటి ఈ సమాజమును మనం ఈనాడు దూరం చేసుకుంటున్నాము. ప్రతి మానవుని యొక్క శాంతి, సమాజంపైనే ఆధారపడి ఉంటున్నది. సమాజమును వదలి ఒక క్షణమైనా జీవించలేం. సమాజం వ్యక్తి సమూహంతో కూడి ఉంటున్నది. అయితే ఇట్టి సమాజ తత్త్వాన్ని మనం అర్థం చేసుకోలేకపోతున్నాం. సమాజం క్షేమంగా ఉండినప్పుడే విశ్వం క్షేమంగా ఉంటుంది.

ఈనాడు శాంతి వచనాలు వల్లెవేస్తూ అశాంతిని పెంచే పనులు ఆచరించే దుష్టులు ఎక్కువైపోతున్నారు. కన్నులుండి కూడా గ్రుడ్డివారిగా జీవిస్తున్నారు. మెదడు ఉండికూడనూ ఉన్మత్తునిగా మారిపోతున్నాడు. ఇలాంటి వారికి ఏవిధమైన శిక్ష విధించాలి? మతి ఉండి ఉన్మత్తునిగా మారేటటు వ్యక్తి కన్నులు తెరిపించాలి. ఏ విధంగా తెరిపించాలి? ఇదియే ప్రేమనేత్రం. ఈ ప్రేమనేత్రమును తెరిచినప్పుడే జగత్తుయొక్క సుఖములు ఆశించడానికి వీలవుతుంది. విశ్వముయొక్క క్షేమమును మనం గుర్తించక, సమాజము యొక్క ఆనందమును విచారించక, విశ్వశాంతిని ఏరీతిగా కోరగలవు? ఇది అసాధ్యం. ఎన్ని సంపదలు ఉండినప్పటికీ, అది నిజమైన సుఖం కాదు. అమెరికా దేశం కుబేరుని సంతతి అని చెబుతుంటారు. అక్కడ కావల్సినంత సిరిసంపదలు ఉంటున్నాయి. కాని అక్కడివారికి మానసిక శాంతి లేదు. అక్కడ ప్రతి పన్నెండుగురిలో ఒకరు పిచ్చివాడుంటాడు. అక్కడి సుఖము భౌతిక సుఖమే. అది ప్రాకృతమైన సుఖమే. వారికి ఏవిధమైన కొరతలు లేవు. కుటుంబంలో ప్రతివ్యక్తికీ ఒక కారు ఉంటుంది. ఇన్ని సుఖములు,

సౌకర్యములున్నప్పటికి వారిలో శాంతి అనేది కానరాదు. కాని భారతీయులు శాంతి స్వరూపులు. ఏ విధమైన ధన కనక వస్తువాహనాదులు లేకపోయినప్పటికి వీరియందు దైవ ప్రేమ అనేది ఇమిడి వుంటున్నది.

అన్ని చింతలకంటే మానవునికి భగవచ్చింతన చాలా ప్రధానమైనటువంటిది. అయితే ఈనాటి మానవునికి మితిమీరిన చింతలు ఉంటున్నాయి. ఇందులో మానవుని అశాంతిలో ముంచేటటువంటివి పన్నెండు చింతలు.

> **"పుట్టుట ఒక చింత, భూమినుండుట చింత**
> **సంసారమొక చింత, చావు చింత**
> **బాల్యమంతయు చింత, యౌవ్వనమొక చింత**
> **వార్థక్యమొక చింత, జీవించుటొక చింత**
> **చెడుపు చింత, కర్మలన్నియు చింత**
> **కష్టముల్ ఒక చింత, సంతసమొక చింత**
> **సర్వ చింతలు బాపెడి సర్వేశ ప్రేమ**
> **కొనుడు ఇకనైన ప్రజలార కోర్కెమీర!"**

ప్రాచీన కాలమున రాజులు ధర్మంతో రాజ్యమును ఏలుతుండేవారు. అందులో బలిచక్రవర్తి ఒకరు. ఈయన విష్ణు భక్తుడు, దయా హృదయుడు, ధర్మ పాలకుడు. ఈ మూడు ఉత్తమ గుణముల చేతనే అతనిని భగవంతుడు వరించాడు. విష్ణు భక్తి ఒకటి ఉంటేచాలు. ఆ భక్తియే సర్వ దుఃఖములను దూరం గావిస్తుంది. నిరంతరం నారాయణుని స్మరించడంవలననే ప్రహ్లాదునికి దుఃఖములన్నీ దూరమైపోయినాయి. కనుక భగవద్భక్తి దుఃఖములను మరిపింపజేస్తుంది. ఆనందమును ఆవిర్భవింపజేస్తుంది. ఉల్లాసమును ఉద్దీపింపజేస్తుంది. దివ్యత్వ తత్త్వాన్ని సృష్టిస్తుంది. పాండురంగ నామస్మరణ చేత అత్త, భర్త పెట్టిన కష్టములను సులువుగా దాటుతూ వచ్చింది సక్కుబాయి. దైవనామాన్ని స్మరిస్తూ తన దుఃఖములను మరచిపోయాడు చక్రధారుడు. దైవనామమునందు ఈ పవిత్రమైన శక్తి ఉన్నది. దుఃఖములను దూరంచేసి ఆనందమును అందిస్తుంది దైవనామం. దుఃఖనివృత్తి ఆనందప్రాప్తి - ఇదియే మానవుని ప్రధానమైన లక్ష్యము దీని నిమిత్తమై దైవత్వాన్ని మనం స్నేహం చేసుకోవాలి.

లోకంలో ఎందరో స్నేహితులుంటున్నారు; దేనికోసం? హలో..... హలో... గుడ్‌బై.... గుడ్‌బై.... అనే స్నేహితులు చాలామంది ఉంటున్నారు. కాని భగవంతుడు అలాంటి స్నేహితుడు కాదు. భగవంతుడు నిరంతరం వెంట, జంట, ఇంట, కంటనే ఉంటుంటాడు. ఇలాంటి సత్య మిత్రుడ్ని, ప్రేమ మిత్రుడ్ని దూరంగావించుకోవటం చేతనే మనం ఇంత శత్రుత్వానికి గురియైపోతున్నాం. ఈనాడు లోకంలో దైవవాంఛ దూరమై పోయింది. ధనవాంఛ, అధికార వాంఛ పెరిగిపోతున్నది. ఈ వాంఛలు పెరగటం చేతనే మానవుడు తన జీవితాన్ని కోల్పోతున్నాడు. ఈ ధనం ఎంతకాలం? వస్తుంది, పోతుంది. చదువులు, ధనం ఇవన్నీ క్షణ భంగురాలు - అని ఏనాడో శంకరాచార్యులు చెప్పారు. ఇవన్నీ అంత్యంలో మనకు ఏమీ ఆధారంకావు. దైవమొక్కడే ఆధారం, దైవమొక్కడే మనకు నిజమైన సహాయకుడు. అయితే మనం ఈనాడు "దైవాన్ని విస్మరిస్తున్నాం, లోకాన్ని విశ్వసిస్తున్నాం." కాదు... కాదు.... దైవాన్ని విశ్వసించాలి. అతనొక్కడే మనకు సంరక్షకుడు.

ఈ ప్రపంచమంతయూ కనిపించేటటువంటి సత్యమే. ఇదంతా ప్రాకృతమైనటువంటిదే. ఇదంతా ప్రవృత్తి సంబంధమైనటువంటిదే. దీనికి ఆధారం ఒకటి ఉంటున్నది. అదియే నివృత్తి. కనిపించే వృక్షములకు కనిపించని వ్రేళ్లే ఆధారం. కనిపించే భవనానికి కనిపించని పునాదులే ఆధారం. అయితే ఈనాడు భవనాన్ని చూచి మురిసిపోతున్నాం. పునాదుల భద్రం లేని భవనం ఏ క్షణాన్నయినా సరే కూలిపోవచ్చును. ఈ దేహం ఎప్పుడైనా నశించిపోవచ్చును. దేహం నీటిబుడగలాంటిది. మనసు కోతి వంటిది. కనుక మనసును అనుసరించవద్దు. దేహమును నమ్ముకోవద్దు. Follow the Conscious (కాన్షస్) అదియే ఆత్మ తత్త్వము. దానిని అనుసరించ కుండా దేహమును మనసును అనుసరిస్తున్నాం. ప్రాకృతమైన జీవితమును గడుపుతున్నంత వరకు దేహం, మనసు ఉండవలసినదే.

ఆనాడు బలిచక్రవర్తి అన్ని సద్గుణములు ఉండినప్పటికినీ ఒక్క 'గర్వము' అనేది వుండటంవలననే అనేక విధముల బాధలకు గురియైపోయినాడు. **'నాది'** అనేటటువంటి అహంకారం, 'నేను' అనే**టటువంటి**

అభిమానం - ఈ రెండే అన్ని దుఃఖములకు మూలకారణం. మోహములో మునిగినటువంటి వారికి ఏమాత్రం మోక్షం ప్రాప్తించదు. మోహం ఉండవలసిందే. ఎంతవరకు? ఈ లోకంలో జీవించేంతవరకు, కొంతవరకు ఉండవచ్చును. మానవత్వాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి. మనం చదివిన చదువులుగాని, చేసే ఉద్యోగాలుగాని, అలరించిన పదవులుగాని మనతోడురావు. ఇవన్నీ మధ్య జారిపోయేటటువంటివే. ఇవన్నీ కదిలిపోయే మేఘముల వంటివే. ఏ మేఘం ఎప్పుడు వస్తుందో? ఎప్పుడు పోతుందో? ఎవరికీ తెలియదు. ఇటువంటి కదిలిపోయే మేఘముల మీద ఆధారపడి మనం ఏవిధంగా జీవితాన్ని సాగించగలుగుతాం? "అనిత్యం అసుఖం లోకం" అని గీత చెప్పింది. ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతమైనదికాదు. కనుక శాశ్వతమైన దానిని హృదయమునందు నింపుకొని, అశాశ్వతమైన జగత్తును సాధిస్తూరావాలి.

బలిచక్రవర్తి ఒకానొక సమయంలో ఒక యజ్ఞం ప్రారంభించాడు. దానిపేరు 'సర్వజిత్'. వామనమూర్తి ఆ యజ్ఞమునకు వెళ్లాడు. బలి చక్కగా స్వాగతం చెప్పాడు. 'బలి' యొక్క అహంకారమును ఏదో విధంగా అణచాలని చక్కటి ప్లాన్ వేశాడు. లోకంలో ఉన్న మానవులు కూడా ప్లాన్ వేస్తూనే ఉంటారు. కాని భగవంతుడు అట్టి ప్లాన్ వేయడు. Master Plan వేస్తాడు. బలిచక్రవర్తి వద్దకు వెళ్లి మూడు అడుగులు దానం మాత్రమే అడిగాడు. లోకరీతిలో ఆలోచిస్తే మూడు అడుగులే గదా! అని భావించాడు. 'బలి'! కాని గురువైన శుక్రాచార్యుడు దూరదృష్టితో ఆలోచించి ఈ దానమును అంగీకరించవద్దని బలితో చెప్పాడు. ఇతను సామాన్య మానవుడు కాదు. మారువేషంలో వచ్చిన భగవంతుడని చెప్పాడు. అప్పుడు బలిచక్రవర్తి "గురూజీ! అతను సాక్షాత్ భగవంతుడే కావచ్చు. భగవంతుడే వచ్చి నాదగ్గర దానం అడుగుతున్నాడు. అడిగేవాడి చేయి క్రింద, ఇచ్చేవాడి చేయి పైన గదా! కనుక భగవంతుని చేయి క్రింద వుంటున్నది కదా! ఇచ్చే నాచేయి పైన ఉంటున్నది గదా! అదే నాకు చాలు" అన్నాడు. అక్కడ కూడా 'బలి' అహంకారం బయటపడింది. అహంకారం ఉండినంత వరకు ఎవరికీ సుఖం లభించదు. భక్తునికి కూడా అహంకారం ఉండకూడదు. భక్తునికి అహంకారం మహా చెడ్డది. చాలా ప్రమాదం తెచ్చిపెడుతుంది. అహంకారం దూరం కావలెనని ఆరు గుణములు స్వంతం చేసుకోవాలి. అవి "ఆనందం, నిత్యం, సత్యం, ప్రేమ, అహింస, ధర్మం" ఈ ఆరు మనలో నివసించాలి. ఇవి గురువులలో కూడా ఉండాలి. భగవంతుడు 'బలి' లోని అహంకారమును నిర్మూలనం గావించి, ప్రేమతత్త్వాన్ని పంచడానికే వచ్చాడు.

బలిచక్రవర్తి భగవంతుని ఒక చిన్న కోరిక కోరాడు. ప్రతి సంవత్సరం ఒక పర్యాయం వచ్చి తన ప్రజలను చూచుకొని పోవాలని కోరుకున్నాడు బలి. భగవంతుడు ఆ వరమును ప్రసాదించి అనుగ్రహించాడు. ఆ దినమునే 'ఓణం' అన్నారు. ప్రజలను దర్శించి, వారిని ఆదరించడం కోసం ఈ దినం బలిచక్రవర్తి వస్తున్నాడు. ఏ చక్రవర్తి అయినాసరే ప్రేమతత్త్వంచేత దైవత్వాన్ని సాధించవచ్చును.

మీరందరూ ఎన్నో సంవత్సరాలుగా ఇక్కడకు వస్తున్నారు పోతున్నారు. దీపాలు వెలుగుతున్నాయి. కొంత మంది వింటున్నారు. కొంత మంది అటూ ఇటు తిరుగుతున్నారు.ఎవరు ఏవిధమైన పనులు చేస్తున్నప్పటికినీ 'జ్యోతి'కి ఏమాత్రం సంబంధంలేదు. ఇది సాక్షీభూతం. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆ వెలుగులో ఎందరో ఎన్ని పనులో చేసుకుంటున్నారు. ఎన్ని పనులు చేసుకుంటు న్నప్పటికినీ, అవి సూర్యప్రకాశమునకు ఏమాత్రం అడ్డు తగలవు. మీరు చేసిన చెడ్డపనుల వలన భగవంతునికి ఏమాత్రం హానిరాదు. మీరుచేసిన మంచి పనుల వలన

భగవంతునికి ఆనందం చేకూరదు. అవి చేసినవానికే వర్తిస్తాయి. భగవంతుడు జ్యోతిర్మయుడు. ఈ జ్యోతిర్మయుడైన భగవంతునికి ఈ మంచి చెడ్డలతో ఏమాత్రం సంబంధం లేదు. కనుక దైవం ఎప్పుడూ సాక్షీభూతుడే. ఈ జీవితం ఒక దీర్ఘ ప్రయాణం. ప్రేమ అనేది మన హృదయంలో నింపుకొనినప్పుడు, సర్వమునూ మనం సులభంగా సాధించవచ్చును. కనుక మొట్టమొదట మన పిల్లలకు ప్రేమతత్త్వాన్ని బోధించాలి. ఎవరియెడల ద్వేషమును పెంచుకోకూడదు. నిన్ను ద్వేషించే వారిని కూడా నీవు ప్రేమిస్తూరా! అప్పుడు వాని హృదయం కూడా మారిపోతుంది. మానవుడి హృదయం Compassion (దయ)తో నిండిఉండాలి. కానీ ఈనాడు Compassion అనేదే లేదు, Fashionతో నిండివున్నాడు. ఈ Fashion ఉన్నంతవరకూ Compassion కు చోటు ఎక్కడ ఉన్నది? మన హృదయం ఒక్కటే Single Chair. డబుల్ సోఫా కాదు, మ్యూజికల్ ఛైర్ అంతకన్నా కాదు. అయితే ఈనాడు మన హృదయాన్ని అంతా Musical Chair గా మారుస్తున్నాం. ఒకటి రావటం, ఒకటి పోవటం జరుగుతున్నది. ఈ Game ఎప్పటికి అవుతుంది? ఇది మన Game కాదు. Life is Game, Play it. ఇది సింగిల్ సోఫా. దీంట్లో మనం ఎప్పుడూ శాశ్వతంగా ఉండాలి. హృదయాన్ని మాత్రం వదలకుండా ఉండాలి. ఎన్ని కష్టములు, ఎన్ని నష్టములు, ఎన్ని దుఃఖములు వచ్చినప్పటికీ, హృదయాన్ని మార్చుకోకుండా చూచుకోవాలి. కష్ట సుఖములు, సుఖ దుఃఖములు, పాప పుణ్యములు వచ్చిపోయే మేఘములవంటివి. అసలు దీనిపేరే 'జగత్'. అంటే జ.....గత్, జ....గత్. రావటం, పోవటమే దీని లక్షణం. ఈ జగత్తులో ఏదీ శాశ్వతమైనది లేదు. దైవం ఒక్కడే శాశ్వతం. మిగతావన్ని మధ్యలో మారిపోయేవే. అయితే ఈనాడు ఈమార్పు చెందేటటువంటి వానిని విశ్వసించి, మార్పు చెందనటువంటి దానిని విస్మరించి మన జీవితంలో అనేక కష్ట నష్టములకు గురి అవుతున్నాము.

ప్రేమస్వరూపులారా!

భగవత్ ప్రేమను మాత్రం పెంచుకోండి! ఎందుకోసమనగా.... మీరే భగవత్ స్వరూపులు. భగవంతుడు మీకంటే వేరుగా లేడు. మీయందే ఉంటున్నాడు. మీయందే ఉంటున్నవానిని మీరు దూరం చేసుకుంటున్నారు. అగ్ని ఉంటున్నది దానిని ఉపయోగించుకోకపోవటం చేత, దాని నుంచే ఒక నివురు వచ్చి అగ్నినే కప్పివేస్తున్నది. అగ్ని ఎక్కడ ఉన్నది? నివురు కిందనే ఉంటున్నది. దానిని ఊదివేసిన అగ్ని మనకు కనపడుతుంది. అదే విధముగ మనయందు దైవత్వమనే అగ్ని ఉంటున్నది. కోరికలు అనే ధూళి చేత కప్పబడి ఉంటున్నది. దానిని ఊదివేస్తే ఆ అగ్ని అనే దైవత్వం కనిపిస్తుంది. సాక్షాత్కారమును ఎక్కడికో పోయి తెచ్చుకోనవసరంలేదు. సాధనలు చేయనవసరంలేదు. మనం చేయవలసింది మనలోనున్న అజ్ఞానమును దూరం చేస్తేచాలు. అవిద్యను దూరం చేయాలి. అప్పుడు మనలో [illegible]నం [illegible] తల్లి అయినా దూరంగా ఉంటుంది గాని, భగవంతుడు అందరికంటే నీకు సమీపుడు. దైవమంత సమీపుడు మరొకడు లేనేలేడు. దైవం చాలా Nearest, Dearest . అట్టివానిని మనం దూరం చేసుకుంటున్నాం. ఇదే మనలో వుండే అజ్ఞానం. ఈ అజ్ఞానం దూరంకావాలంటే ప్రేమను పెంచుకోవాలి. కష్టాలు వచ్చినప్పుడు దైవచింతన అధికంగా చేయాలి. దైవాన్ని అమితంగా ప్రేమించాలి. ప్రాచీన కాలమునందు ఆచరణకు ప్రాధాన్యత యిచ్చేవారు. ఈనాడు ఆచరణపోయింది. అలంకారానికి ప్రాధాన్యత యిస్తున్నారు. ఆచరణలోనే ఆనందం వుంటుంది. ఆచరణ లేని విద్యలు ఎన్ని నేర్చినా నిష్ప్రయోజనం. కనుక మొట్టమొదట ఆచరణకు ప్రాధాన్యత యివ్వాలి. Practical Knowledge కావాలి. Plat Form Speaches కాదు. ఈ Plat Form Speaches అంతా Superficial Knowledge మాత్రమే. ఇది Bookish Knowledge. దీనివలన మనకు ప్రయోజనంలేదు. ఆచరణలో పెట్టు, ఆనందించు. ఆచరణలో లేని భక్తి ప్రయోజనం లేదు. అందరిలో భక్తి ఉంటున్నది. కాని త్యాగం మాత్రం కనిపించటంలేదు. 'బలి' అనగా త్యాగం. హృదయం భక్తికి మూలం. బలి చక్రవర్తిలో భక్తి మరియు త్యాగం వుండటంవలననే దైవత్వాన్ని పొందగలిగాడు.

బలిచక్రవర్తి, శిబిచక్రవర్తిలాంటి త్యాగధనులకు పుట్టినిల్లు ఈ భారతదేశం. అభయమిచ్చిన పావురాన్ని రక్షించడానికోసం, ఏమాత్రం సంకోచించకుండా తన శరీరాన్నే కోసియిచ్చిన త్యాగశీలి శిబిచక్రవర్తి. ఒక పావురం

కోసం ఇంత త్యాగం చేశాడు శిబి. ఇలాంటి త్యాగశీలురైన చక్రవర్తులు అనేకమంది అనాది కాలంనుంచి భారత దేశంలో పరిపాలన చేస్తూ వచ్చారు. కనుకనే అనాది కాలం నుంచి భారతదేశం ఆధ్యాత్మిక సంపత్తిని, సుస్థిర శాంతి భద్రతలను అనేక దేశములకు అందిస్తూ వచ్చింది. అలాంటి మహనీయుల బోధనలను కనీసం ఒకటి రెండైనా మనం ఆచరణలో పెట్టి చూపించాలి. త్యాగమును గురించి మనం చదువుకున్నామేగాని భోగమును అనుభవిస్తున్నాం. ఈనాడు త్యాగమును కోరటంలేదు, భోగమును కోరుతున్నారు. భోగమును కోరటంచేతనే రోగములలో మునిగిపోతున్నాం. ఈనాడు దేశంలో ఎక్కడ చూచినా రోగాలు....రోగాలు.... కారణమేమిటి? **భోగాలే రోగాలకు మూలకారణం.** ఈ రోగాలను నివారణ గావించు కోవాలంటే, త్యాగం చేత భగవంతుని ప్రేమించాలి.

**ప్రేమస్వరూపులారా!**

ఆనాడు బలిచక్రవర్తి కేరళ రాజ్యమునకు ఎన్నో విధములైన సేవలు చేశాడు. తన సర్వస్వాన్ని త్యాగం చేశాడు. కట్టకడపటికి తన దేహమునే త్యాగం చేశాడు. అందువలననే బలిచక్రవర్తి స్థానం ఈనాటికి ఎవరికీ లభించలేదు. ఆ రాజ్యంలో వుండిన భక్తి మరెవరికీ లేదు. ముక్తిని పొందాలంటే భక్తిని ఆచరణలో పెట్టండి. అన్నీ ఆచరణలో పెట్టలేకపోయినప్పటికీ కనీసం ఇతరులు మనకు చేసిన అపకారమును మరచిపోండి. ఇతరులకు మనం చేసిన ఉపకారమును మరచిపోండి. అప్పుడే మీ హృదయం ప్రశాంతంగా ఉంటుంది. 'క్షమ సర్వస్వంబు సర్వ **లోకముల యందు**' ఈ క్షమా బుద్ధిని మనం పెంచుకోవాలి. ఈ క్షమా బుద్ధి భగవత్ ప్రేమ చేతనే లభిస్తుంది. కనుక ప్రేమను పెంచుకోండి!

(ప్రశాంతి నిలయంలో ఓణం పండుగ సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి) ⊕

## పదాల పందిరి - 14 సమాధానాలు

**అడ్డం :**

1. అల 3. దాపు 5. నాగలి 7. విహారి 8. మరిది 9. సరళ 10. క్కుటుచి 12. ముగ్గులు 14. రంగు 15. ఒర

**నిలువు :**

1. అటవి 2. పొగ 4. పునాది 5. నారికేళము 6. లిమరిక్కులు 9. సవరం 11. చివర 13. గ్గుర

# పదాల పందిరి - 15

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | 3 | 4 |
| | | 5 | | 6 | | |
| 7 | | | | 8 | | |
| | | | | | | |
| 9 | | | | 10 | | 11 |
| | | 12 | 13 | | | |
| 14 | | | | | 15 | |

## ఆధారాలు

**అడ్డం**

1. ఇష్టము
3. శిఖండి పూర్వరూపం
5. ముక్కు మీద కోపం కలవాడు
7. స్త్రీ
8. సంగీత ధ్వని
9. తిరగబడ్డ కుక్క
10. శ్రీరామనవమి తీర్థం
12. పాదాలకు అలంకరణ
14. చిల్లు
15. బాధ

**నిలువు**

1. ఎసిఫోటిడా (తెలుగులో)
2. కోడి అరుపు మధ్యలోనే ఆగిపోయింది.
4. శక్తి, సత్తువ
5. పరమేశ్వర ప్రసాదిత అస్త్రం తలక్రిందులుగా వస్తుంది.
6. శూలధారి
9. తెలుగు 'మజిల్'
11. శ్రీకృష్ణుని మేనమామ
13. వటవృక్షం

- కిరీటి

# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం

సౌరాష్ట్ర దేశే విశదేతి రమ్యే జ్యోతిర్మయం చంద్రకళావతం సమ్ ।
భక్తిప్రదానాయ కృపావతీర్ణం తం సోమనాథం శరణం ప్రపద్యే ॥ 1

శ్రీశైల శృంగే విభుధాతి సంగే తులాద్రి తుంగేపి ముదావతం సం ।
తమర్జునం మల్లిక పూర్వమేకం నమామి సంసార సముద్రసేతుమ్ ॥ 2

అవంతికాయాం విహితావతారం ముక్తి ప్రదానాయచ సజ్జనానామ్ ।
అకాల మృత్యోః పరిరక్షణార్థం వందే మహాకాల మహాసురేశమ్ ॥ 3

కావేరికా నర్మదయోః పవిత్రే సమాగమే సజ్జన తారణాయ, ।
సదైవ మాంధాతృ పురే వసంతమోంకార మీశం శివమేకమీడే ॥ 4

పూర్వోత్తరే ప్రజ్వలికా నిధానే సదావసంతం గిరిజాసమేతమ్ ।
సురాసురారాధిత పాదపద్మం శ్రీవైద్యనాథం తమహం నమామి ॥ 5

యామ్యే సదంగే నగరేతి రమ్యే విభూషితాంగం వివిధైశ్చభోగైః ।
సద్భక్తి ముక్తి ప్రదమీశమేకం శ్రీ నాగనాథం శరణం ప్రపద్యే ॥ 6

మహాద్రి పార్శ్వేచ తటే రమంతం సంపూజ్యమానం సతతం మునీంద్రైః ।
సురాసురైర్యక్ష మహోరగాద్యైః కేదార మీశం శివమేక మీడే ॥ 7

సహ్యాద్రి శీర్షే విమలే వసంతం గోదావరి తీర పవిత్రదేశే ।
యుద్దర్శనాత్ పాతక మాశునాశమ్ ప్రయాతి తం త్ర్యంబకమీశ మీడే ॥ 8

సుతామ్రపర్ణీ జలరాశి యోగే నిబధ్యసేతుం విశిఖై రసంఖ్యైః ।
శ్రీ రామ చంద్రేణ సమర్పితం తం రామేశ్వరాఖ్యం నియతం నమామి ॥ 9

యం ఢాకినీ శాకినికా సమాజే నిషేవ్యమాణం పిశితా శనైశ్చ ।
సదైవ భీమాది పద ప్రసిద్దే తం శంకరం భక్తహితం నమామి ॥ 10

సానంద మానంద వనే వసంతమానందకందం హతపాపబృందం ।
వారాణసీనాథమనాథ నాథం శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే ॥ 11

ఇలాపురే రమ్య విశాలకేస్మిన్ సముల్లసంతం చ జగద్వరేణ్యమ్ ।
వందే మహోదారతర స్వభావం ఘృష్ణేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే ॥ 12

జ్యోతిర్మయ్యం ద్వాదశ లింగకానాం శివాత్మనాం ప్రోక్తమిదం క్రమేణ ।
స్తోత్రం పఠిత్వా మనుజోతి భక్త్యా ఫలం తదాలోక్య నిజం భజేచ్ఛ ॥ 13

# శక్తిపాతము

బాబానుండి దివ్యమైన ఆధ్యాత్మిక శక్తి అనేక మార్గముల ద్వారా భక్తులకు ప్రవహిస్తుంది. ఒక దివ్య పురుషుని నుండి ఈ విధంగా అనుగ్రహపూర్వకమైన దివ్యశక్తి ప్రవహించడాన్ని యోగుల పరిభాషలో "శక్తి పాతము " అంటారు.

యోగిపుంగవుల నుండి దివ్యప్రేమ, ఆధ్యాత్మిక శక్తి ఇతరులకు ఐదారు మార్గముల ద్వారా ప్రవహిస్తుంది.

ఇందులో మొదటిది, గురువు శిష్యుని కళ్ళలోనికి నిశితంగా దృష్టిని సారించడం; దీనినే "అక్షి సంయోగ శక్తిపాతము" అంటారు.

రెండవది, గురువు తన ఏకాగ్ర మనస్సు ద్వారా శిష్యుడు ఆపదలోనున్నప్పుడు అత్యంత శక్తివంతమైన ఆధ్యాత్మిక తరంగములను పంపి అతనిని కాపాడడం. ఇది, బాబా భక్తులకు ప్రసాదించే ఉంగరము లేక గొలుసు ద్వారా కూడా కావచ్చు. ఈ పద్ధతిని 'మహా శక్తిపాతము' అంటారు.

మూడవ మార్గము. గురువు శిష్యుని హృదయ కమలముపై తన దివ్య హస్తమును ఉంచి ప్రేమ, ఆధ్యాత్మిక శక్తుల ద్వారా దానిని ఉత్తేజపరచడం. ఈ మార్గమును "హృత్ శక్తి పాతము" అంటారు.

నాలుగవ మార్గము. ఆ దివ్యపురుషుడు తన దక్షిణ హస్తమును పూర్తిగా చాచి సాధకుని శిరస్సుపై ఉంచి ఆశీర్వదించడం. దీనిని "హస్త మస్తక సంయోగము", అంటే, ఆ దివ్యపురుషుని దక్షిణ హస్తముతో సాధకుని శిరస్సు యొక్క పై భాగము సంయోగము చెందడం. దీని వలన దివ్యానందమనే అమృతము సాధకుని శిరస్సునుండి క్రిందకు ప్రవహించి శరీరమంతా వ్యాపిస్తుంది.

ఐదవ మార్గములో గురువు, సాధకుని ఆర్తిని మన్నించి ఆతడు తన శిరస్సును, హస్తములను గురువు యొక్క చరణకమలములపై కొంతసేపు ఆన్చి ఉంచడానికి అంగీకరిస్తాడు. తద్వారా గురువు యొక్క చరణములు, ఆయన బొటనవ్రేళ్ళు ఆధ్యాత్మికమైన ప్రాణశక్తిని శిష్యుని శరీరములో ప్రవేశపెడతాయి. ఈ విధంగా పాప ప్రక్షాళన చేసి రక్షించే జీవాధారమైన దివ్యశక్తి సాధకునిలో ప్రవేశపెట్టబడుతుంది.

ఇక ఆరవ మార్గములో పైన చెప్పిన అన్ని మార్గములు, గొప్ప ఆధ్యాత్మిక ప్రాముఖ్యతగల ఒకే ఒక పరిపూర్ణమైన సంఘటనలో మిళితమై ఉంటాయి. ఇక్కడ సాధకుడు నిస్వార్థప్రేమతో, పరిపూర్ణమైన ఆత్మ సమర్పణ భావముతో ఆ దివ్య పురుషుని ముందు సాష్టాంగపడి తన శిరస్సును, హస్తమును ఆయన చరణకమలములపై ఆన్చి, తాదాత్మ్య భావముతో, తన వైపు నిశిత దృష్టితో చూస్తున్న గురువు చూపులో చూపు కలుపుతాడు. అప్పుడు గురువు తన దివ్యహస్తమును శిష్యుని శిరస్సుపై ఉంచి

**ఘండికోట వెంకట సుబ్బారావు**

అతనిని ఆశీర్వదిస్తాడు. దివ్యమైన ప్రాణశక్తి ప్రవహించే ఆధ్యాత్మికపరమైన ఈ ఒక్క క్షణంలో సాధకుడు తన అంతరంగములో నిరుపమానమైన, భావాతీతమైన, తాదాత్మ్య స్థితిలో పొంగిపొరలే దివ్యానందమును అనుభవిస్తాడు.

తరువాత, అనేక సందర్భాల్లో మాకు గుర్తుండి పోయేటట్లు స్వామి ఈ విధంగా తమ దివ్యహస్తమును అనుగ్రహ పూర్వకముగా నాశిరస్సుపై ఉంచి ఆశీర్వదించారు. ఈ విధమైన హస్తమస్తక సంయోగము వలన నేను ఎంతో దివ్యానందమును అనుభవించానని ఖచ్చితముగా చెప్పగలను.

క్రిందటిసారి ఈ రచయిత ఇటువంటి తాదాత్మ్య స్థితిననుభవించినది, బెంగుళూరులో గల వైట్‌ఫీల్డు వద్దనున్న త్రయీ బృందావనంలో స్వామి ఇచ్చిన ఇంటర్వ్యూ పూర్తయిన తరువాత, ఆ సమయంలో బాబా నా కోరిక మన్నించి అపూర్వమైన దివ్యానందములో నేను మునిగితేలేటట్లు నాకు అవకాశమును అనుగ్రహించారు.

ఆ మరునాడు ఆయన విద్యార్థులతో మాట్లాడుతూ, వారు తమ పూర్వజన్మ పుణ్యము వలననే

ఈ విధంగా స్వామియొక్క దివ్య హస్తము తమ శిరస్సులపై పడే అవకాశమును పొందుతున్నారని చెప్పారు. పైకి చూడడానికి అతి సాధారణంగా కనిపించే స్వామి యొక్క ఈ చర్య, దానిని అనుభవించిన అదృష్టవంతుల మనస్సులలో పేరుకునిపోయిన చెత్తను తొలగించి, వారి శారీరక, మానసిక రుగ్మతులను తొలగించి, చివరకు వారిని ఆత్మజ్ఞానమునుపొందే ఆధ్యాత్మిక సాధనలో ప్రవేశపెడుతుంది. దీనికి ఇంత గొప్ప ప్రాముఖ్యత ఉన్నది. అయితే, ఆయనే చెప్పినట్లు, చాలా కొద్దిమంది మాత్రమే ఈ హస్తమస్తక సంయోగము యొక్క నిజమైన ప్రాముఖ్యతను దానివలన ఒనగూడే లాభములను పూర్తిగా గ్రహించగలరు. ఈ సంయోగము జరిగే సమయంలో సాధకులు మాత్రం తమ హృదయములను పూర్తిగా, భగవదనుగ్రహము లభించేందుకు వీలుగా, తెరచి ఉంచాలి. అప్పుడే, వారు దివ్యమైన ఈ అనుభూతిని పొందగలరు.

## శాంతిధామ!

శ్రీకరుండు హరుఁడు శిష్టులకాపాడి
ధర్మముద్ధరింప ధరణియందు
యుగయుగంబులందు నుద్భవించెడువాడ!
సత్యసాయి రామ! శాంతిధామ!
పుణ్యనదులప్రోవు! పూతచరితుల ప్రాపు!
సస్యశ్యామలంబు! సఫలదంబు!
హరిహరంబు నాంధ్రి నలరింపనెన్నితే!
సత్యసాయిరామ! శాంతిధామ!
ఎన్ని సంస్తుతులను నిన్ను నర్చించితో!
ఎన్నినోముల ఫలమేకమయెనొ!
కాకయున్న నీదు కమల చరణమబ్బు!
సత్యసాయిరామ! శాంతిధామ!
నిన్నుఁజూడదరికి నే జనుదెంచిన
హర్ష బాష్పచయములడ్డుతగిలె
చేతులెత్తి మ్రొక్క చేరదు దోయిలి!
సత్యసాయిరామ! శాంతిధామ!

- కె. పాండురంగశర్మ

గ్రంథసమీక్ష :

## వచనంలో సుందరకాండ

సైజ్ 1/4 క్రౌన్, ఆఫ్‌సెట్‌ముద్రణ
పుటలు 200 - బహువర్ణ ముఖచిత్రం
పెద్ద టైప్‌లో - మేలురకం కాగితంపై ముద్రణ
వెల రూ. 50-00
రచయిత : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

ప్రతులకు : ఫోన్ : 462964

**శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి**
సంచాలకుడు : భాగవత మందిరం
గోదావరీ రైల్వేస్టేషన్ సమీపంలో - సూర్యాహోటల్ ప్రక్కన, జయశ్రీ టాకీస్‌రోడ్ -
డోర్ నెం. 29-6-13డి, రాజమండ్రి -4.

విశ్వవ్యాప్తంగాగల ఆంధ్ర ఆస్తిక పాఠకులలో గత 3 దశాబ్దాలుగా సద్గ్రంథరత్న ప్రచారం చేస్తున్న శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి కలంనుండి ఈ వచన సుందరకాండ వెలుగులోకి వచ్చింది.

శ్లోకాలూ, పద్యాలూ చదువజాలని వారి కోసం చదివినా సంపూర్ణంగా గ్రహించజాలని వారి కోసం ఈ గ్రంథరత్నం ఎంతగానో ఉపకరిస్తుంది.

అక్షరజ్ఞానం ఉన్నవారికల్లా అర్థమయ్యే సరళమైన, మనోహరమైన శైలిలో రచనకొనసాగింది. ముఖ్యంగా వృద్ధులు సైతం సునాయాసంగా పఠించు కోవడానికి వీలుగా పెద్దటైప్‌లో బహువర్ణ ముఖచిత్రంతో పదికాలాలపాటు చక్కగా ఉండాలన్న ఉద్దేశ్యంతో సర్వాంగ సుందరంగా రచయిత దీనిని ప్రచురింప జేశారు. ప్రతి వ్యక్తీ ముమ్మారు చదివి సత్ఫలితాలను పొందదగినది ఈ గ్రంథరత్నం అనడంలో అతిశయోక్తి ఎంతమాత్రంలేదు. అత్యధిక వ్యయ ప్రయాసలకోర్చి కేవలం, ప్రచారమే ప్రధానలక్ష్యంగా కృషిచేస్తున్న శ్రీ రాధాకృష్ణమూర్తిగార్కి ఆంధ్రులందరూ విశేషించి శ్రీ మారుతీ సీతారామ భక్తులు అందరూ ఋణపడి ఉంటారనడం అతిశయోక్తి కాదేమో!

సమీక్షకులు : **శ్రీ శంభర సన్యాసిరావు**, అనపర్తి.



# శ్రీ సోమనాధుడు

ఈ జ్యోతిర్లింగం సోమనాధుడనేపేరుతో విశ్వవిఖ్యాత మందిరంలో స్థాపితమై ఉంది. ఈ దేవాలయం గుజరాత్ ప్రాంతంలోని కాఠియావాడ క్షేత్రంలో సముద్రతీరంలో ఉన్నది. పూర్వం ఈ క్షేత్రం ప్రభాస క్షేత్రం అనే పేరుతో ప్రసిద్ధమై ఉండేది. ఇక్కడే శ్రీ కృష్ణ భగవానుడు జరా అనేపేరు గల వ్యాధుని బాణాన్ని నిమిత్తంగా చేసుకుని తన లీలను ఉపసంహరించుకున్నాడు. (చాలించాడు) ఇక్కడి జ్యోతిర్లింగం యొక్క గాథ పురాణాల్లో ఈ విధంగా ఉంది.

దక్షప్రజాపతికి ఇరవై ఏడుమంది కుమార్తెలు ఉండేవారు. వారందరి వివాహం చంద్రుడితో జరిగింది. కానీ చంద్రుడి సమస్త అనురాగము వారిలో ఒక కన్య అయిన రోహిణి యందే ఉండేది. అతని ఇటువంటి ప్రవర్తన దక్షప్రజాపతి యొక్క ఇతర కుమార్తెలందరికీ చాలా కష్టంగా ఉండేది. వారందరూ తమ వ్యధాభరిత వృత్తాంతాన్ని తమ తండ్రికి వినిపించారు. దక్షప్రజాపతి ఈ విషయంలో చంద్రదేవుడికి అనేక విధాల నచ్చచెప్పాడు. కానీ రోహిణీ వశీభూతమైన ఆయన హృదయం మీద ఏ ప్రభావము పనిచెయ్యలేదు. ఆఖరికి దక్షుడు కృద్ధుడై క్షయరోగివి కమ్మని శపించాడు. ఈ శాపకారణంగా చంద్రుడు తక్షణమే క్షయగ్రస్తుడయ్యాడు. ఆయన క్షయగ్రస్తుడవ్వటంతోనే భూమండలం మీద సుధాశీతలత్వాన్ని వర్షించే ఆయన సర్వకార్యమూ స్తంభించిపోయింది. నలుదిశలా 'రక్షించండి. రక్షించండి' అనే ఆర్తనాదం మారుమ్రోగింది. చంద్రుడు కూడా చాలా దుఃఖితుడయ్యాడు. చింతాగ్రస్తుడు కూడా అయ్యాడు. ఆయన ప్రార్థనని ఆలకించి ఇంద్రాది దేవతులు, వశిష్ఠాది ఋషిగణం చంద్రోద్ధరణ కోసం బ్రహ్మపితామహుని వద్దకు వెళ్ళారు. వారందరి వచనాలు విని, బ్రహ్మదేవుడు యిలా అన్నాడు. "చంద్రుడు తన శాపవిమోచనం కోసం ఇతర దేవతలందరితో కూడి పవిత్ర ప్రభాస క్షేత్రానికి చేరి మృత్యుంజయ భగవానుని ఆరాధన చేయుగాక! ఆయన కృపవల్ల చంద్రుని శాపము తప్పక విమోచనం అవుతుంది. ఆపైన అతడు రోగముక్తుడు కూడా అవుతాడు."

బ్రహ్మదేవుని వచనానుసారం చంద్రుడు మృత్యుంజయ భగవానుని ఆరాధనా విధినంతా పూర్తి చేశాడు. ఆయన ఘోర తపస్సు చేస్తూ పదికోట్ల మృత్యుంజయ మంత్రాన్ని జపించాడు. దీనితో మృత్యుంజయుడైన శివభగవానుడు చంద్రుడికి అమరత్వం కలిగేలా వరప్రదానం చేశాడు. ఆయన చంద్రుడితో "ఓ చంద్ర దేవా! నీవు శోకించకు. నా వరం వల్ల, నీ శాప విమోచనమే కాకుండా దానితోపాటు దక్షప్రజాపతి యొక్క మాట క[illegible] నిలబడుతుంది. కృష్ణ పక్షంలో ప్రతిరోజా నీ యొక్క ఒక్కొక్క కళ క్షీణిస్తుంది. కానీ తిరిగి శుక్ల పక్షంలో అదే క్రమంలో నీ యొక్క ఒక్కో కళ వృద్ధి

**జోస్యుల రామచంద్ర శర్మ**

పొందుతుంది. ఈ విధంగా ప్రతి పూర్ణిమకు నీయొక్క పూర్ణ చంద్రత్వం లభిస్తూనే ఉంటుంది" అన్నాడు. చంద్రునికి లభించిన ఈ శివుని వరం వల్ల సర్వలోక జీవులు ప్రసన్నులయ్యారు. ఆనందంతో ఉప్పొంగిపోయారు. సుధాకరుడైన చంద్రుడు తిరిగి దశదిశలా సుధలను వెదజల్లే కార్యాన్ని యధాపూర్వకంగా కొనసాగించసాగాడు.

శాపవిముక్తుడైన చంద్రుడు అన్య దేవతలతో కూడి మృత్యుంజయ భగవానుని యిలా ప్రార్థించాడు, "స్వామీ! నీవు పార్వతీదేవితో పాటు సదా ప్రాణుల ఉద్ధరణ కోసం యిక్కడే నివాసం ఉండెదవుగాక!" శివభగవానుడు చంద్రుని ప్రార్థనను మన్నించి, అప్పటినుంచి జ్యోతిర్లింగ రూపంలో పార్వతీమాతా సమేతంగా అక్కడ ఉండసాగారు. పవిత్ర ప్రభాస క్షేత్రంలో వెలసిన ఈ సోమనాధ జ్యోతిర్లింగం యొక్క మహిమ, మహాభారతంలో శ్రీమద్భాగవతంలో యింకా స్కాంద పురాణాదులలో సవిస్తరంగా పేర్కొనబడింది. చంద్రుడి యొక్క ఒక నామం (పేరు) సోముడు కూడా. ఆయన శివభగవానుణ్ణే తన నాధుడుగా, అనగా స్వామిగా భావించి యిక్కడ తపస్సు చేశాడు. కాబట్టి యీ జ్యోతిర్లింగాన్ని సోమనాధుడుగా పేర్కొంటారు. ఈ జ్యోతిర్లింగం యొక్క దర్శనం వల్ల, పూజాదుల వల్ల, ఆరాధన వల్ల భక్తుల జన్మజన్మాంతర సర్వ పాతకాలు, దుష్కర్మలు నశించిపోతాయి. వారు శివపార్వతుల అక్షయ కృపా పాత్రులౌతారు. మోక్ష మార్గం వారికి సహజంగానే సులభమౌతుంది. వారి లౌకిక, పారలౌకికమైన సర్వ కార్యాలు వాటంతటవే అనాయాసంగా సఫలమౌతాయి. ◉